శ్రీ రాఘవేంద్ర గురుభ్యో నమః

# శ్రీశారదా గణేశ వరప్రసాద

# వధూవరులు

ద్విపాత్ర  ఏకాంకనాటిక.






: రచయిత :

వంశపారంపరానుభవవైద్య, జ్యోతిషతల్ప, వాస్తు స్వయంభువు

శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల

**వేంకటవరదాచార్యులు,**

కొండలదిన్నె (పోష్టు)

తాడిపత్రి తా॥ 1969 అనంతపురం జిల్లా




[ వెల రు. 2-00

శ్రీ రాఘవేంద్రగురుభ్యో నమః

# శ్రీశారదా గణేశ వరప్రసాద

# వధూవరులు

ద్విపాత్ర ——•—— ఏకాంకనాటిక.








: రచయిత :

వంశపరంపరానుభవవైద్య, జ్యోతిషరత్న, వాస్తు వ్వయంభువు

శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల

వేంకటవరదాచార్యులు,

కొండలదిన్నె (పోస్టు.)

తాడిపత్రి తా॥ అనంతపురం జిల్లా



1969

ప్రథమముద్రణము 500 ప్రతులు.




[ వెల రు. 2-00

శ్రీరాఘవేంద్రగురుభ్యోనమః

# విజ్ఞాపన.

మహాశయులకు !

నేనీ విధముగ రచనసాగించుటకు కారణము ఏమన విద్యార్థులు బాల్య యౌవన కాలములో పూర్తి యౌవనావస్థకాలములో తెలిసి తెలియని సంధికాలములో యుగసంధియున్నట్లుండునను ఈసమయములోన పైచదువులు చదువుచు సప్తవ్యసనాలోలుర స్నేహమున వ్యసనములకు లోబడి భావిజీవిత మెటులౌనను తలంపులేక తలిదండ్రులకొర్కెలడుగంటింపజేసి విద్యనుచెరచుకొని తలిదండ్రుల అర్జనాధనము దుర్వ్యయమొనర్చి వారిదీవనలకు బదులు దూషణలకుపాత్రులై ఇటువృత్తికి అటు యుద్యోగమునకు ఉపకరింపక వివాహసమయమునకు విలువలేక కన్యనిచ్చువారెందున్గానక పరాభవములపాలై స్వార్జనలేక పితృధనముపై ఆధారపడుచు మాతృపితృదూషణలతో భస్మమగుచు పత్నిలలో రాణించక బంధుమిత్రులలో పలుచనై కడకు దుఃఖించు వారలనేకులచూచి వధూవరు లను పేర ఏకాంకనాటికగా రచించితిని.

నానొనర్చినది నానేదాచక చెప్పగలుగు వారుందురా యను సందేహము గలుగువారుండకపోరు. నానొనర్చిన జారచోరత్వముల మొదలుకొని సర్వవ్యసనముల నాన్నియుమానుకొని మంచిస్థితికి వచ్చినప్పుడు చెప్పతగినవారికడ సందేహింపక చెప్పుము చెప్పుచుండిరి. స్వీయచరిత్రల నెందరో వ్రాసుకొనిరి వ్రాయుచుండిరి దానిననుసరించి నానొనర్చిన సర్వవిషయముల నానే చెప్పినట్లు రచించితిని—

లోకానుభవమువల్లను జ్యోతిష్యమువను గమనించిన సందేహనివర్తి కాగలదు—

కవులువ్రాసిన నీతులు మానవుని బుద్ధిమార్పగలవా? మానవుడు మారగలడా? అనువారెందరో యుండిరి. అవినీతిపరులై యుండి కొంతకాలమునకు నీతిపరులుగా మారినవారుండిరి. విర్ధనులై ధనికులైన

వారుండిరి, దీనికి కారణము పూర్వజన్మపాపపుణ్యములు వీటివల్ల జాతక రీత్యా బుద్ధిస్థానాధిపతితో బుద్ధిస్థానములో పాపగ్రహములుండి అవి ఆడించును. ఆడించినట్లు ప్రతిమానవుడు ఆడవలసియుండును. ఆపాప గ్రహదశలు గడచిపోయిన తదుపరి బుద్ధులుమారి నీతిపరులై ప్రకాశింప గలరు, అట్లుగ్రహములు మారనివారు జీవితాంతమువరకు మారజాలరు. దాన, అజ్ఞానులు జ్ఞానులై ప్రకాశింపగలరు. జ్ఞానులు అజ్ఞానులైపోగ లరు. దీనికికారణము పూర్వజన్మ సత్కర్మ దుష్కర్మలేయగును. కర్మ ములులేవని జన్మలేదని యెదిరించు మతములు మానవులు లేకపోలేదు. ఉన్నవి పైలోకమున దండింపబడినజీవి పవిత్రుడౌనుగదా. పవిత్రునకీ లోకమెట్లులభించగలదని వాదించువారుండిరి. రాజదండనగలిగిన యమ దండన లేదనియు యమదండనగలిగిన ఈలోకమునదండన మరెట్లువచ్చు ననియు వాదించెడువారుండిరి. యమలోకమున శిక్షవిధించి ఈలోకము నకు పంపగాచేసినది, చేయింతురను వారుండిరి- జోశ్యము జ్యోతిర్బ లము గలవారు పైలోకమున శిక్షవిధింతురు, ఈలోకమున ననుభవింతు రందురు. పాపపుణ్యానుసారముగ జీవిఅనుభవించును— ముందుచేసిన పాపపుణ్యములు నవగ్రహకేంద్రములనుండి క్షణక్షణమునకువచ్చుచు ఏ ఏ జీవికి ఎట్లుమారవలయునో మారి సుఖ దుఃఖముల గల్పించుచుండు నందురు.

భగవత్ నిర్మితమున లోకపాలకులు నవగ్రహములేయైయున్న వందురు. జ్యోతిశ్శాస్త్రజ్ఞులు ఈగ్రహములకు తెలియక యేకార్యము గాదు. ఏదినడువదు- కాలమును నడిపించువారు జీవులపాలించువారు వీరేయటందురు—— భగవంతుడు తన్నుదలచుచు తామనిర్దేశించిన ధర్మ ములకు లోబడి కష్టమనక అచరణలో నుంచుకున్నవారు తనవారని వారికిసహాయమిచ్చి తనచెంతచేర్చుకొనును. ఈవిషయముల జ్యోతిషము జ్యోతిచెప్పును.

శాస్త్రముల వాదోపవాదములలో ఏకసంతగ్రాహులై ఏమయ

స్ఫూర్తి జ్ఞానముగలవారు జయింతురు- అనేకసంతగా హితశక్తి వగ్రి హామిచ్చుచున్నదో ఆవిధము తానుస్థిరపరచును—— శని, బుధ, శుక్ర, రాహు, గ్రహములు హింసోపదేశకులు. పెడమార్గమును. మార్గమును వారు గురు, రవి, కుజ, చంద్ర, కేతు గ్రహములు అహింసోపదేశకులు చక్కనిమార్గమును చూపువారు- ఇందులో చంద్రుడు పాపులచేచూడబడిన బుద్ధి పొరబడుచునేయుండును- చంద్రుడు శుభుడై అహింసా గృహములందుండి శుభులచే చూడబడినవారు. చక్కనితోవలవేయుదురు. వారికి యిహపరముల సుఖమేదొరుకును పాపపుణ్యానుసారముగ బుద్ధిగలుగుచుండును ఒకభావము పలువురకు పలువిధముల గన్పడుటకు వారి వారికున్న గ్రహములే కారణము.

శాస్త్రములెన్నిచెప్పినను కవులెన్నివిధములవ్రాసినను పాపపుణ్యానుసారముగ వచ్చునది, మాన్పలేవను స్థిరప్రజ్ఞనవలంభించినయెడల లోకము సర్వముచెడుననునది తెలిసినదేకదా ఆవిధముగ నూశకున్నయెడల విజ్ఞానము సర్వమడుగంటకయుండునా అందువల్ల తెలిసినంతవరకు కవులు రచియించుచుందురు చదివి తెలివిగలిగి పురోగమించనీ ఆచరణలో మంచకే తిరోగమించనీ రచయితలకు బాధ్యతలేదుకదా.

పైవిధముగ ప్రశ్నలు అనేకము మిత్రులువేసిరిగాని విద్యార్థులకు యౌవనులకు ఇటువంటిరచన ఉపకరించుననని నామతముగుటచే శక్తికొలది ఏకాంకనాటికగ రచించితిని. కవులు- పండితులు- చదువరులు- విద్యార్థులు- ఈవధూవరుల ఆశీర్వదింపప్రార్థన.

ఇట్లు,

గ్రంథకర్త

# పండితాభిప్రాయములు.

శ్రీ

కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే ॥

అని కావ్యప్రయోజనము లాఱుగాఁ బేర్కొనబడినవి. వానిలో నుత్తరోత్తరములు బలీయములు. సరసతనాపాదించి పఠితలఁ గర్తవ్యమునఁ గుతుకులుగాఁ జేయఁగల కావ్యకన్యకయే స్పృహణీయ యని విద్యానాథుడుఁ ఆ రెండుగుణములు లేని కావ్యము కావ్యము కాదన్నమాటయే.

ప్రకృతగ్రంథమున సరసత్వము కర్తవ్యోన్ముఖీకరణము చక్కఁగాఁ బోషింపఁబడినవి. శారద పసిప్రాయమునందే మామపై మమకారము మలచుకొన్నది. కాలకర్మసంయోగముతో కాలేజీ ఆతనిని దుర్వ్యసనకళాపట్టభద్రునిగావించినది. దరిద్రదామోదరుఁడైనవానిని బాగుపఱుపఁగలనన్న ధైర్యముతో ననన్యచిత్తయైన శారద సావిత్రిని స్మరణకుఁ దెచ్చును. ప్రథమనిశ్చితుఁడైన వరుని వదలరాదనుటయే కాక పతితుఁ బునరుద్ధరించుటయే విద్యావతులకుఁ గర్తవ్యమను నుపదేశము నాచరణపూర్వముగఁ జూపినది. ఫిలాసఫీ పట్టభద్రురాలగుట కిదియే ఫలము. ఫిలాసఫియనగా ముక్కుమూసికొనుట బిక్కచిక్కుట కాదుకదా!

గణేశవరప్రసాదపాత్రము విచిత్రమైనది. చిన్నవాడు మిక్కిలి చురుకుబుద్ధి చదువుపైశ్రద్ధ అవధానాదులు సేయునేర్పు కలిగినవాడు కాలేజిలోఁ జేరినంతనే సహవాసదోషముతోనో యౌవనప్రయుక్తేంద్రియోల్బణముతోనో అట్టడుగునకుజారి వికారియైనాఁడు. అట్టివాడిట్లగునా యని యనుమానపడనవసరము లేదు. "బలవానింద్రియగ్రామో విద్వాంసమపికర్షతి". మాటున మరుగుదొడ్లరుచి మరిగి సూటిగ నీటులు చాటుకొను వాచాటులకు చపేటమువంటి దీఘట్టము.

అనుభవపూర్వముగ దుర్వ్యసన దుష్ఫలితముల నంతుగనుగొన్న వరప్రసాదుఁడు భార్యకాఁబోవు పడతియెదుట దనవృత్తాంతమును దాచి

పెట్టక పూసగ్రుచ్చినట్లుచెప్పుట ఆతనిసత్యసంధతకు తార్కాణము కను కనే మనసు మార్చుకొన్నాననుట శారదకు విశ్వాసపాత్రమైనది. ఎట్లో చెడినవారు తమతప్పును తాముగ్రహించుటయే కాక లోకము కన్నుకప్పక వెల్లడించి వానిని విసర్జింపవలయునను నుపదేశ మీపాత్రలో ధ్వనించుచున్నది కావ్యము మంగళాంతము చేయబడినది.

కవిగారు సర్వజనావగాహనము నాదర్శముగా గొనుటలో పెక్కులు వ్యావహారికములు దొరలినవి కొన్ని వ్యాకరణదోషములు గలిగినవి. ఉద్దేశము ఉత్కృష్టమైనపుడివి లెక్కలోనివి కావు వీరిలేఖిని నుండి ఇతోధికోన్నత రచనలు వెలువడగలవని విశ్వసింతును.

కాడిపత్రి
2-7-1969

ఇట్లు,
విద్వాన్ జోస్యము జనార్దనశాస్త్రి.

---

శ్రీమతేరామానుజాయనమః.

శ్రీమదిత్యాది శ్రీమాన్ తి. న. చ. వేంకటవరదాచార్యులవారి సన్నిధికి- విన్నపములు.

మీరువిశ్వాసముతో పంపిన శ్రీగణేశ నారదసల్లాపము- శ్రీశారదా గణేశవరప్రసాద వధూవరులు అను రెండుపుస్తకములుచేరినవి ధన్యవాదములు. రెంటిని స్థూలముగా చదువుకొన్నాను. ఇతరకార్యవ్యాపృతి వలన నిదానముగా చదువుకొనవీలుకాలేదు మన్నింపుడు- ఇకముందు వీలుకొలది నెమ్మదిగ పరిశీలింతును- చదివిచూచినంతలో మీనిర్భయ ధారాళ మధుర రచన నన్నెంతో ఆకర్షించినది. వైద్య. జ్యోతిష వాస్తు శాస్త్రముల వ్యాసంగము నడుమ ఇంతస్వతంత్రమైన కావ్యధార మీకెట్లబ్బినదో శ్రీ శ్రీనివాస వరప్రసాదమనుకొందును మీకవిత్వశక్తిరచన ఇంకను కట్టుదిట్టములతో ఆధునిక తెలుగు సారస్వతము నలంకరించుచు లోక కల్యాణమునకు సాధనము కాదగునని నామంగళాశంస.

బెంగుళూరు.
6-7-1969

భవదీయుడు,
రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

శ్రీమతేనారాయణాయనమః

## మహాశయా మంగళాశీర్వచనములు

శ్రీమన్నారాయణచరణసేవా ధురీణులైన మీరు శ్రీరాఘవేంద్ర స్వామి భక్తిలోని సోదరత్వమొకటే నాఅభిప్రాయ మఖిలమించుటకు కారణమనుకొనుచున్నాను- నాయభిప్రాయమిది.

ఈవధూవరులలో మీ మాతృజ్యోతిలోని సంభాషణా వైచిత్రిలేదు మీజ్ఞానజ్యోతిలోని ప్రతిభాయుతోపన్యాస ధోరణిలేదు సామాన్యపదము లకసామాన్యముగుచేవ చేకూర్చిన మీగణేశ నారదసల్లాపములోని బుద్ధివై భవము కల్పనాశక్తి కవితాచమత్కృతి లేవుకానీ 18వ శతాబ్దపు కవు లలోని నీతిశాస్త్ర పటిష్ఠతయును విస్తారమైన ప్రపంచానుభవమును బాగుగా నెలకొన్నవి మీపదలాలిత్య మన్నిటికన్నా గొప్పది ఈకాలపు కవులకు రుచింపకపోవచ్చునేమో కాని నాబోటివారికి మీనాటకము పర మాహ్లాదకరముగా నున్నదనుట నిర్వివాదాంశము మీకృతులన్నిట గణే శనారద సల్లాప ముత్తమమైనది ఇదిమూడవది. మీమాతృజ్యోతి పూర్వా చారుల పాలిటి భాగ్యజ్యోతి.

అనంతపురం.
1-7-1969

సర్వదా మీశుభాకాంక్షలముకోరు,
కల్లూరు వేంకటనారాయణరావు.

---

శ్రీమాన్ టి. యన్. సి. వేంకటవరదాచార్యులు పుస్తకముమీద పుస్తకమువ్రాసి ప్రకటించుట నాకు ఆనందము ఆశ్చర్యము కలిగించు చున్నది.

ఊర్ణనాభమున దారమువలె ఆచార్యులవారియందు గద్యపద్యా త్మక సారస్వతధార నిరర్గళముగా వెలువడుచున్నది. మహాదశాను కూల్యమున వీరిలోని వాగ్ధారకదలినది ఎడతెగక ప్రవహించుచున్నది. ఏమి మాహాత్మమున గ్రంథారంభముచేసిన గ్రంథము నిర్విఘ్న శీఘ్రపరి సమాప్తి పొందగలదో యెరిగి చేయుచున్నారు గొప్పలోకానుభవము కద్దు ఇది మాత్రప్రాయమైన నాయభిప్రాయము.

ప్రొద్దుటూరు.
2-7-1969

పి. వి. సుబ్బన్న,
(శతావధాని.)

## కుశలము

శ్రీమదిత్యాది శ్రీమాన్ టి. యన్. సి. వేంకటవరదాచార్యుల సన్నిధికి నమోవాకములు.

మహాశయా! మీరంపిన ఏకాంకనాటిక వధూవరులు 27-6-69 తేది చేరినది. సాంతము పఠించితిని దీనికి ఏకాంకనాటిక అంటిరి. శ్రవ్యనాటిక అనడము మరింత యొప్పుననుకొందును - పద్యప్రచురమై ప్రబంధశైలిలో సాగిపోయినదీగ్రంథము. కల్పితగాథయయ్యును నేటి విద్యార్థిలోకము స్వరూప స్వభావములను వెల్లడించుచు వారు తమ ఇతివృత్తము నొక్కపరి సింహావలోకనము చేసికొని సంస్కరించుకొనుట కెంతేని యుపకారిగ నున్నది.

సీ॥ వేకువనే లేచి విధులెల్లపాటించి దలిదండ్రులిద్దరన్ దలచిమదిని

లక్షణములివ్వి విద్యార్థి లక్షణములు (పు 52)

అనునది నూతనము గాకపోయినను విద్యార్థులవశ్య మనుసరింప దగినవిధి సూత్రము - వధువొనర్చిన కర్మసిద్ధాంతము అనాదిసిద్ధము.

తెలిసితెలిసి దుష్టుడై భ్రష్టుడైన మామను ఉద్ధరించి సంస్కరించుటకుబూనిన వధువు ఉదారహృదయత ప్రశంసనీయము లోకోపకృతికై నిట్టి కావ్యమొనర్చిన కవి రచన ధన్యము - ఇట్టివి చదువుటోపిక అర్థముచేసికొను యోగ్యత కాగుపడు నదృష్టము విద్యార్థులకు కలుగుగాత,

తిరుపతి - ధర్మవరం (అనంతపురంజిల్లా), ఇట్లు,
4-7-69 కుంటిమద్ది శేషశర్మ.

---

శ్రీమాన్ టి. యన్. సి. వేంకటవరదాచార్యులవారికి,

మహాశయా తాముపంపిన "వధూవరులు" అను కృతిని నా మూలాగ్రముగ చదివి సంతోషించితిని తమ కవితాశైలి నిర్ఝరిణీ ప్రవాహమువలె నిరర్గళముగా సాగినది. చాల సరసముగా సరళముగా నేటి విద్యార్థినీ విద్యార్థులకు నీతిదాయకముగా తమ కావ్యము దృశ్య

మయ్యును శ్రవ్యకావ్య మర్యాదలతో విరాజిల్లినది. ఈకృతి పాఠక లోకమునకు మహోపకృతియై చిరస్థాయిగా నిలుచుగాక. తమ గ్రంథమునకు హృదయపూర్వకాశీస్సులతో

—: అభినందన పద్యరత్నములు :—

మ॥ వరదాచార్యా! భవత్కృతంబయిన కావ్యంబుం బరికించితిన్
సరళానేకపదార్థ భావరసవచ్ఛైలీసుసౌలభ్యసం
భరితంబై శ్రుతిపేయమై సుకవిసంభావ్యార్హమై త్వన్మహో
వరపుణ్య ప్రతిరూపమై వెగడుతన్ భావింపనెల్లప్పుడున్.

ఉ॥ చక్కగ నీవు వ్రాసిన ప్రశస్త వధూవర సచ్చరిత్రమున్
మిక్కిలి శ్రద్ధతో చదివి మెచ్చితి నిచ్చితి నాశిషంబు నా
కెక్కడగూడ మచ్చునకు నేవియు శోత్రమునందు దోషమం
చొక్కుడు లేమిదోచెడిని నోకవి నిన్ను నుతింపశక్యమే.

చ॥ ద్వివిధములైన కావ్యముల దృశ్యము శ్రవ్యమునన్న భిన్నగా
గవులు పఠింతురాతఱివు గట్టిగనాటిన నీవునైతమున్
ప్రవిమల దృశ్యకావ్యమును శ్రావ్యముగా రచియించి ధన్యత
విని పరమోదకారివయి పెంపుగడించితి కావ్యరత్నమా.

ఉ॥ మానుగ నీవు మానవసమాజ సముద్ధరణార్థమై కృతిన్
బూని రచించి నీదగు ప్రభూతపు పాండితియున్ విశేష లో
కానుభవంబు చాటి యశమందితి పొందితి మేటి సప్త సం
తానములందు శ్రేష్ఠముగుదానిని బుణ్యుడవీవు సత్కవీ.

తే॥ నీతికి బుట్టినిల్లయి గణింపగ కాతకపెన్నిధానమై
ఖ్యాతికి మెట్టినిల్లయి మహోకవి పూజ్యమఖండ పాండితీ
ద్యోతకమౌచు వ్యాకరణదోషవివర్జితమై భవన్మహో
పేత వధూవరాఖ్యకృతి భూస్థలినిల్చుత శాశ్వతంబుగన్.

చ॥ సరసకవిత్వ కన్యనిను సంతతముఁ వరియించుతన్ భవ
ద్విరచితమౌ వధూవర పవిత్రచరిత్రము మేటికావ్యమై
వరలుత దీనికిదగును బాపురే యక్షరలక్షలైననో
వరకవి యిట్టిసత్కృతులె వ్రాయుచునుండుము దైవసత్కృపన్.

రచయిత: శారదాపుత్ర పి. వెంకటరెడ్డి,
(విద్వాన్) తెలుగు పండితుడు
S. K. G. ఓరియంటల్ హైస్కూల్,

ప్రొద్దుటూరు
4–7–69

---

మహాశయా! భవద్విరచితమగు శ్రీగణేశనారదసల్లాపము అమూలాగ్రముగ పఠించి అమందానందమునొందితిని.

చ॥ సలలితధారగా సులభశైలినివ్రాసిన కందగీతముల్
కలయగజూచివాడ మదికౌతుకమందెను మీకవిత్వము
జ్వలముగ శాశ్వతంబుగ విశాలముగ వెలుగొందుగాక మీ
కలము సదానిర్గళముగావడువంబడుగాక విచ్చలున్.

కం॥ ఆర్యావేంకటవరదా
చార్యా ప్రతిపద్యమందు చక్కనినీతిన్
ధైర్యత దెలిపితివో కవి
వర్యా [illegible] పాలించుమిమున్.

కవివరా శ్రీశారదా గణేశవరప్రసాద వధూవరుల జాతకను దర్శించి పఠించి అందుమీరుతెలియపరచిన సర్వజనోపయోగ ధర్మముల సంఖ్యానేకముగ నుండుటగాంచి ప్రశంసనీయమగు మీభూతదయా పరత్వంబున కచ్చెరువందితిని. శ్రీశారదా గణేశవరప్రసాద కళ్యాణంబు [illegible] ఆదర్శంబున నిల్పుటచే మీరుధన్యులు.

కం॥ శ్రీవేంకటవరదాచా
ర్యావిబుధులు కీర్తినేయ రమణీయముతో
[illegible]గ్రంథంబులు
శ్రీవెలయగనుండుగాక చిరకాలంబున్.

సుగుణావతంస త్వదీయ గ్రంధరాజంబగు జ్ఞానజ్యోతిని చూచితిని సంతోషము. జ్ఞానజ్యోతినాద్యంతము పఠించినగానీ పఠించువారి సముఖంబుననుండి విన్నగానీ నిక్కువముగా జ్ఞానమునందు జ్యోతిగా ప్రకాశింతురనుట కేలాటిసందియములేదు. ఇట్టిపవిత్రగ్రంధమును రచించిన మీరు కడుంగడు ధన్యులు.

కం॥ కుటిలమగు శబ్దజాలము
లెటనిలుపక నెల్లరును గ్రహించెడుసరణిన్
స్ఫుటగతి గృతిజేసిన వేం
కటవరదాచార్య కవిజనప్రియకార్యా.

ఉ॥ జ్యోతిష వాస్తు వైద్యముల శుద్ధుడవీవటుగాగ వానిపై
ఖ్యాతిగపద్యకావ్యములుగా రలగజేసి ప్రజానురాగివై
భూతలమందుసద్యశముబొంది కవీంద్రుడవై వెలుంగుమో
పూతచరిత్రమిమ్మెపుడు భోగిశయానుడు బ్రోచుగావుతన్.

కం॥ వెంకటవరదాచార్యా
శంకలబోవీడి జ్యోతిషంబున పద్యాల్
బొంకముగ వ్రాసి నీవశ
లంకచరిత్రుడవుగమ్ము లక్షణఫణితిన్.

ఇట్లు,
చిరశుభచింతకుడు,
కొడవలూరి పెద్దరామరాజు.

రామేశ్వరము.
9-7-1969

---

ఈరచన సహృదయభావముతో చూచి సంస్కరించి సదభిప్రాయములిచ్చి ప్రోత్సహించి ప్రేమతోచూచిన బ్రహ్మశ్రీ విద్వాన్ జోస్యము జనార్ధనశాస్త్రిగారికి నాకృతజ్ఞతాభివందనములు.

సమయమునకు తగినట్లు చక్కగా ముద్రణచేసియిచ్చిన శ్రీరంగరామానుజప్రెస్ ప్రొప్రయిటరు శ్రీ రంగయ్యగారికి ముద్రణాలయ పనివారికి ఆయురారోగ్య భాగ్యములు భగవంతుడొసంగుగాక.

ఇట్లు బుధజనవిధేయుడు.
రచయిత.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యో నమః

# మేనరికము - లేక - వధూవరులు

## కథ.

మేనరికపు వధూవరులుగా శారదా గణేశు లిరువురు ఒకేయింట చదువుచు అన్యోన్యులై వద్దికతో ఒకరినొకరు ప్రేమించుకొనుచు బహుభాగ్యములతో తులతూగుచు ప్రజలతో శారదా గణేశ వరప్రసాదులనిపించుకొనుచు చదువులో శారదాగణేశులవలెనే ముందుకుసాగిపోవుచు కాబోవు నిల్లాలని కాబోవుభర్త యని హృదయములురెండు ఒకేజాడలో పోవుచు భావవిభేదములేక అహ్లాదముతో పెరిగి పెద్దమార్కులతో యస్. యస్. యల్. సీ., గణేశ్ ప్యాసయినాడు- ఈతడు ఆకారములో గణేశుడుకాడు కాని- బుద్ధిలో గణపతికి ఈడనవచ్చు. రూపములో నవమన్మధుడనవచ్చు. శారద, శారదగా ఫిఫ్తుఫారము ప్యాసైనది. సాక్షాత్ శారదయనిపించుకొన్నది. గణేశ్ వెంటనే కాలేజీలోచేరి పదునారేండ్లు నిండులోపలనే అష్టావధాన శతావధానములుచేయుచు ఆశుకవిత్వము దిగ్దంతులవంటికవి. పండితులమధ్యలో సారసంశముగ ధారావాహిగచెప్పుచు మరొకప్రక్క రేడియోగాయకుడై అర్జనచేయుచు కనువారికి వినువారికి మిరిమిట్లుగొల్పుచుండి పూర్వజన్మ కర్మానుసారమున దుస్సహావాసముతోడుపడి జూదము, తాగుడు స్త్రీలోలత్వము మొదలగు సప్తవ్యసనముల నభ్యాసముచేసికొని తల్లిని ధిక్కరించి కాలేజీకి స్వస్తిచెప్పి దుర్వ్యసనాలోలుడై యావదాస్తి పాడుచేసి తినతిండి కట్టబట్టలేనివాడై యెల్లరుఛీయన వెనుకనయ్యో ముందు గొయ్యోయై బూజుపట్టిన బుద్ధికస్నైగై కర్మదేవతా కౌగిలినుండి దిగజారి వెనుకమజిలీపట్టి అయ్యోయనువారుగాని హాయనువారుగానిలేక చతుర్దిక్కుల నెటుచూచిన దారిగానక స్తబ్ధుడైనిలచి- తనివితీర ఒకసారి శారదను చూచి కండినకన్నీటితో గద్గదస్వరముతో శారదా కడసారిచూపు ఇదేనని చెప్ప వీలెప్పుడబ్బునని వెతకుచుండెను— శారద మంచిమార్కులతో యస్

యస్. యల్ సీ. ప్యాసయి ఎం. ఏ. చదివి ఫిలాసఫిలో పట్టభద్రుడై తనమేనమామదుర్గతికి చింతించుచు ఆనాటినుండి మామ అక్కయింటికివచ్చుట గాని తనకొక లేఖవ్రాయుటగాని లేకపోవుట అమ్మను అక్కను బావను లెక్కసేయకపోవుట తలంచి యోచించుచు పాపము మామ కర్మజీవి. పూర్వ కర్మవల్ల బుద్ధిమారి చెడిపోయెను. పూసి కాసెడు సమయములో ఝంఝా మారుతము వాతపడిన భూరుహము రీతి తల్లి ఆశలడుగంటింపచేసెను. అడు గంటెను. చంద్రబింబమువంటి ముఖము ఎంతచూచిన తనివితీరని చంద్రికళ తాండవించుచుండెను. కాకవేసి మెరుగుపెట్టిన బంగారు సలాకువంటి దేహము త్రాగుడుతో అకాలనిద్రలు అకాలభోజనములనుభవించి వేశ్యా లోలత్వముతో జూదముతో నిద్రాహారములు మరచి కండ్లలోనికి పండ్లు ముందుకువచ్చియుండును. ఈవిషమపరిస్థితులవల్ల స్థిరచరాస్తులుపోగా బిక్క కాయలుతిన్న కోతివలె ముడుచుకొని ఆలోచనలో మునిగియుండును. పడుమువిరిగిన నాగువలె ఎటుపోవుటకు వీలులేనివాడై యుండును. నడవడి చక్కగాలేనినరుడు బ్రతికిఫలములేదు. బ్రతుకుట దుఃఖములకొరకేయనవ చ్చును- ఈచిన్నవయసులో ఇన్నిదుర్గుణము లలవడుటకు పూర్వకర్మమే కారణము. కర్మము పండితునైనను పల్టీలుకొట్టించును. పశువునుచేయును తన ఏకసంథాగ్రాహితశక్తి జ్ఞాపకశక్తి అష్టావధాన శతావధాన ఆశుకవిత్వ మేమయ్యెను. బూజుబట్టి బూడిదపాలయ్యెను- బుద్ధిః కర్మానుసారిణియన్న వచనము నిక్కవమే. యోగిని భోగిని విరాగిని రోగిని త్యాగిని కర్మము ఒకేగోతిలో త్రోయును. దైవముకూడ దీనినెదిరింపలేదు- నేనికమామను చూడలేను. నాకుకానరాదు. మామవల్ల నేనెంతోసుఖపడుదు ననుకొంటిని బూరుగఫలములాసించిన చిలుకవలె నాయాశలు నిరాశలయ్యెను. నేను మామను చూడబోవుట తగనిపని. లోకమెట్లెట్లో అపనిందలు మెడగట్టును మరెట్లుచూడగలను. అక్క బావ జాబులకు తిరిగిచూడడు. నేను వ్రాయు టమంచిదికాదు యని తలంచుకొనుచుండగా తలిదండ్రులు తగినసంబంధము కొరకై వెతుకుచుండుట విని మరింత వ్యాకులపడుచు- తెగించి మామను

కట్టుకొవి బాగుపరచుకొందమన్న పపద్ధతిలోతానున్నాడో ఇదితోవగాదిది తోవయనిచెప్పిన నామాటలు వినునో వినడో ఎట్లుచెప్పవలయును తానన్ని తెలిసినవాడు తెలియచెప్పువాడు శకునములుచెప్పుబల్లి కుడితిబానలోపడి చచ్చినట్లు విషమస్థితిలో పడినాడు. నామాటలకు చెవియొగ్గునో యొగ్గడో యని ఆలోచించుకొనుచుండ తనపుట్టినపండుగ జ్ఞాపకమునకువచ్చి యోచించి సరే అమ్మతో యొకజాబువ్రాయించిచూచెదను. ఎందరిట్టివారు బాగుపడ లేదు. బాగున్నవారు నిర్మూలముకాలేదు. పూర్వజన్మకర్మ సాంగముగ అయిపోయిన దరిద్రుడు దామోదరుడైనవాడుగలడు. నిరక్షరకుక్షి సకల శాస్త్రపారంగతుడైనవాడుగలడు. క్షయరోగపీడితుడై శల్యావశిష్టమై కాటి కెదురుచూచువాడు శక్తివంతుడై మదించు మదకరీంద్రమునెత్తగల బలశాలియైనవాడుగలడు. మామకుజన్మకర్మ మయిపోయియుండిన జాబుచూచినతోడనేరాగలడు. వచ్చిచూచి నామాటలువిని బాగుపడి తనవంశమును కీర్తిని నిలుపుకొని సుఖపడగలడు, కానిచూతమని తల్లికినచ్చచెప్పి జాబు వ్రాయించినది.



శ్లో॥ శివం హరిం విధాతారం తత్పత్నీస్తత్సుతాన్ గురూన్
నత్వాసమస్తపత్రిక్యాహ శాంతయే మంగళాయచ.

కం॥ శ్రీకరులగు ముమ్మూర్తులు
నీకవితా కన్యయశము నెప్పుడుగావన్
లోకహితార్థము నిలుపను
వేకరములు మోద్భిదలకు నిశ్చలభక్తిన్.



శ్రీ శారదాంబాయైనమః

# మేనరికము - లేక - వధూవరులు.

## ద్విపాత్ర — ఏకాంక నాటిక.

కం॥ శారద పుట్టినపండుగ
వారసి కనులారప్రీతి నాశీస్సులిడఁ
మీరరు దేరగవలెనని
కోరుచునున్నాముఱందు కూరిమితోడఁ.

ఆ॥ అక్క యిటుల వ్రాసినట్టి లేఖముగని
ఏమయమబ్బెననుచు సంతసించి
మనసుతృప్తిపడక మరిమరిచదువుచు
అమ్మవినగచదివి యనియొప్పిరి.

కం॥ ఆదరణమ్ముగ వ్రాసెను
పోదము మరియాదమిగుల పోయినమీదఁ
సాందనబోధన సేతము
కాదనుపనిలోన మేలుకానీపోనీ,

ఆ॥ ఘనత ధనము విద్య గౌరవంబులుగల్గు
వారుమనకు పిల్లనీరు నిజము
అడుగలేదటనక యడిగివత్తముపోయి
పోదమనుచు లేచి పోయిచేరి.

ఉ॥ పండుగనాడు సంధ్యకడ ప్రక్కనపూచిన పూలతోటలో
నుండెడుశారదన్‌గనియు నూహలుపెల్లుబుకన్ మనంబునం
దుండెడువన్ని చెప్పుకొని 'ఊ' యనిపించను మంచివేళయే
పండెనటంచు తిన్నగను పజ్జనచేరి వినంగనిట్లనెన్.

## వధూవరులు.

తే॥ శారదానీవు కడుసువిశాలమతివి
బాల్యమాదిగ నాకథాభారతంబు
తెలిసియుండినదేకదా తెలుపనేల
పడితి పడరానిపాట్లెల్ల పతనమైతి.

వ॥ శారదా నీవన్ననో

కం॥ చదివితివి ఫిలాసఫినిటు
చదివితివి మతానుగుణ్య శాస్త్రములెల్లన్
కుదిరెను సుగుణములెల్లను
పదిలంబుగ నింటబయట ప్రాజ్ఞులు మెచ్చన్.

శా॥ మామా నేటికిబుద్ధిమారినదియా మాయింట కాల్వెట్టగా
సామాన్యంబుగ బుద్ధిమార్చుకొనవే శాస్త్రంబులన్నమ్మవే
కామారాద్యుల కగ్రనాయకుడవే కర్మంబువమ్మందువే
నీమాటల్ యెటుపోయెనేడు? నిజమా? నీమంత్రతంత్రంబులా?

వ॥ శారదా, లేదులేదు మంత్రముగాదు తంత్రముగాదు నాస్వీయచరిత్రను చెప్పుకొన తగినవారు నీకన్న నాకువేరొకరులేరు. చేసినచేతల పడినపాట్లు అయిన యవమానములు చెప్పుకొని దుఃఖముపశమింపచే
కొన వచ్చితిని ఇటువిను.

సీ॥ తలమున్కలుగత్రాగి తందనాలాడినా వాడినామనసార వాడినాను,
వెలగల్గుసిగరెట్ల వెతకితెప్పించుయు త్రాపినా దగదీర త్రాగినాను
రేబవల్ జూదంబు లెక్కకుమితిమీరి ఆడినా నాడించియోడినాను
పూలపాన్పులపైన పూబోండ్లతోగూడి పండినా నుండినాదండిగాను

తే॥ స్త్రీలకెన్నియొ కనకాభిషేకములను
చేసి కాసులె శీర్షానబోసినాను
పోసి కాలేసి యీవేషమేసినాను
వేసి మానాభిమానాల విడచినాను.

వ॥ మామా (వచ్చును)

వ॥ ఉండు ఉండు సాంతముగవిని ఉన్నంతనవ్వుము.

తే॥ ముందుకన కాభిషేకాల సందుకొన్న
వారెమెడబట్టినూకి చెంపలనుగొట్టి
పాదమర్దనచేయించి పంపగాను
బుద్ధికుదిరెను కొంచెము దిద్దుకొంటి.

వ॥ మామాచెంపలనుగొట్టి పంపాసరోవరమునకు పంపలేదా,

వ॥ పంపాసరోవరమా అదిఇక్కడనున్నది. లోకముగాని లోకమునకు పాతాళమునకేపంపినారు బలిచక్రవర్తికి తోడుండుమని.

వ॥ మామా మర్దనం గుణవర్దనం అన్నారు. దానితో గుణము కుదుటపడిన దన్నమాట. ఔను చలరేగిన అగ్నిఆర్ప మన్న గాని నీరుగాని శాంతలె లేదా సమిధలై పోవలె ఊరకారిపోదుకదా.

వ॥ శారదానీవన్నమాటనిశ్చయము మన్నుశాల్చికొట్టినారు నీరు షేడనీరు చల్లినారు సమిధలా సర్వస్వముదగ్దమై బూడిదై పోవువరకు విడువలేదు అప్పుడుగదా స్త్రీలయొక్క-ఛీవాట్లు ఛీవాట్లతో నగుబాట్లు అగచాట్లు యుట్టిపాట్లతో మీయింటికివచ్చుటకు ముఖమెక్కక ధర్మరహితమైనదారియని తోచితాకనిలచితిని.

చ॥ వ్యసనములేడిటుల దిగినవారలస్నేహము చేసికొన్నచో
పసచెడుగౌరవంబు- చెడుపావనమైనకులంబు- ఛిద్రముల్
ముసురుకొనున్గృహంబు- డిగుపుణ్యఫలంబు- వినాశహేతువౌ
వ్యసనములున్నవాడు తమబంధువులిండ్లకుపోవదెప్పుడుఁ.

వ॥ శారదా ఈసప్తవ్యసనములలో జైటపడి భ్రష్టుచేయునది త్రాగుడు ఆప్తబంధువునైనను వీడుమీవాడా, అన్నవారితో వీడావరమపక్కిరి మావాడా? కాదనితప్పుకొని తిరుగజేయును, త్రాగుడుమానవజీవిత మును మట్టిపాల్చేయును బంధుమిత్రుల దూరము చేయును. గౌరవ నీయులలో లోకువచేయును. త్రాగుడుబోతువారిమాటలు నమ్మ కమా అని ప్రజలతో అనిపించును. సుఖయసుఖములమూల్చి దిబ్బపాల్

చేయును ఇటువిను-

ఉ॥ తా్రిగుడుబోతుతోడ నమృతంబును తా్రిగివ మద్యమేయగున్
తా్రిగుడుబోతు స్నేహమున తప్పకడిగ్గును గద్దెఘాతయుఁ
రాగిపసిండిలోకలియ లావునశింపదె? వన్నెతగ్గదే?
బాగుననోగునుఁ దెలిసి బంధువులిండ్లకు పోవుటొప్పునే.

వ॥ మామా ఇన్నీ తెలిసి ఈగోతిలో ఎందుకుపడితివి? అంతకంపు సారా నీ
కిం పెట్లరుచ్యెను? అందులో అంత అనందమున్నదందువా?

వ॥ ఆ ఆనందమా చెప్పెదనువిను.

సీ॥ ప్రాణంబు లెదిట పైపెక్కి పడత్రొక్కి ఊయని యుబ్బాతలూచివైచు
సిగ్గునువిడనాడి సివమెక్కినడువీధి ఆడించిపాడించి నదిమికుదుము
తో్రివపోనియ్యక తూలించి తూలించి ఛీవాట్లుపెట్టించి చిత్తుచేయు
కాల్ తొ్రిక్కకయ్యంబు ఋణములోకల్పించి మన్నుదులుపగజేసి
అన్నుచేయు

తే॥ గౌరవంబును ధనమును గంగగలిపి
నాలుపిల్లలసౌఖ్యంబు కాలనలిపి
తల్లిదండ్రుల సత్కీర్తి గుల్లజేసి
నుభయమార్గాలచెడత్రొక్కి యుసురుదీయు.

తే॥ ఆనుపగజ్జలతల్లిని విల్లుజేర్చి
కట్టబట్టయు తినతిండి కరువుజేసి
కాల్చుపిల్లల తల్లుల కరుణలేక
మద్యపానంబులోగల్గు మహిమమిదియె.

వ॥ శారదా నిక్కము వచింతువా.

తే॥ మద్యపానంబుమరగిన మానవుండు
మానుకొన్నను మనసులోస్థానముండు
స్థానమా మొల్కలెత్తించు సమయమెరిగి
చవినెరుంగనివాడెపో సజ్జనుండు.

వ॥ మామా అనుభవించినవారెందరో ఇట్టిఅనుభవముల చెప్పుచుండ అనుభ
వించి రుచిచూతమనువారు వెఱ్ఱివారా లేక వారికర్మమా,

వ॥ నిజము నిజము. వెఱ్ఱివారు కారు. వారికర్మము వారిభార్యాపిల్లలకర్మము
వారితలిదండ్రుల కర్మము ఏకమై బ్రాందీసారా రూపమై దారిద్ర్య
దేవతకు నొప్పచెప్పును- శారదా మధ్యపానము సప్తవ్యసనములలో
ప్రప్రథమదేవత- ప్రథమస్థానమునలంకరించి మానవునినోట తాల్చిమట్టి
కొట్టును- దీనికి మొదటనే స్థానమియ్యనివాడు ధన్యుడు- యిచ్చెనా
చచ్చినట్లే- శారదా ఇంకొకటి ద్వితీయస్థానమందుకున్న కామదేవత-
పైదేవతాస్వరూపము బ్రాందీ సారాసీసా తోడుచేసుకొని కదముతొ్రి
క్కించి మొదటమానముతీయించును పిదప ధనాపహారణచేయించును.
కడకు ప్రాణమేహరించును అంటువ్యాధివలె బంధుమిత్రులకుకూడా
దాపురించును. యిటువిను-

ఉ॥ కాముకుతోడనేస్తమున కల్గువిపత్తుగృహంబు చేర్చిన॥
నీమముతప్పి దుర్ణయమునేర్పి తిలోదకమిచ్చుస్త్రీలకు॥
కాముకునింటజేర్చ సురనాథుడుకూడ తపించు చింతతో
పామునుపెంచినట్లనుచు వాని గృహస్థులు చేర్చరెవ్వరు॥.

వ॥ మామా ఇన్ని తెలిసి ఎట్లువిపత్తులపాలైతివి? కాముకుని యిల్లుచేర్చుట
పామునుచేర్చినట్లగునని తెలిసి వ్యభిచారి వెట్లయితివి? నీయాత్మనీకు
మార్గమిట్లని చెప్పలేదా? తెలియకపోవుటకు విద్యావిహీనుడవా?

వ॥ శారదా విను విను ఆమద్యపాన జ్యేష్ఠునకు ముద్దులతమ్ముడు కామము
అముద్దులతమ్మునికి ప్రియమైన కనిష్ఠసోదరుడు జూదము. అబ్బా దీని
ఆనందమేమనిచెప్పదునులే ముందుగాగొప్పగాగెల్చి మిద్దెలు మేడలు
మళ్ళు మాన్యాలు ఆర్జించవలెనను ఆశచూపి సంచికొంత ఖాళీచేయును.
అటుపైపోయినది రాబట్టవలె రాబట్టవలెనను ఆశ తీవ్రముచేసి నిద్రా
హారములచంపి నిందలపాలుచేసి అంతయు పోయినంతవరకు కనుమూ
యదు, ఇందులో లాభముగన్నవారు నూటికొకడు వాడుకూడ

నిందపాలుగాకమానదు. చెట్టు చెడుకాలమునకు కుక్కమూతి పిందెలు పుట్టునన్నట్లు మానవుడు చెడుకాలమునకు చెడుబుద్ధులనేకములుగ లుగును. అభిషేకములు కనకాభిషేకములు చేసి కాసులేని బికారినై కడగండ్లపాలైతిని. సర్వసంఘ పరిత్యాగినై సన్యాసినౌటొక్కటేతక్కువ. శారదః వ్యసనములలో ధనము తొందరగా కూలిపోవుమార్గము జూదము వానితో స్నేహము చేసిన వానికికూడ చెడ్డపేరువచ్చును.

ఉ॥ జూదరితోడి స్నేహమున జూదరిపీడను నామధేయముఁ
జూదమువాడకేగలిగి న్యూనతదెచ్చును దైవపాతకుఁగా
జూదరిపోవరాదు తనచుట్టములిండ్లకు మిత్రులిండ్లకుఁ
గాదనిపోయెనేని తనుగందురు వింతమృగంబుభాతిగఁ.

వః శారదా ఈచెడుగుణములున్నవానిని యిల్లుచేర్చిన దేవేంద్రునైనను పరాభవముల పాలవుట నిజము.

కం॥ సప్తవ్యసనములందున
గుప్తంబుగ డిగునుమొదట కొసకవిరేగుఁ
గుప్తముక్లుప్తము రెండును
తప్తముగావించు పిదప తగదెవ్వరికిఁ.

వ॥ మామా.

ఉః లోకుమతప్పుమఁ దెలిసి ధర్మపరాయణ తత్పరుండవై
లోకులు ఛీయనఁ తగనిరోతలనేకము చేసిచేసి బల్
వ్యాకులమంద బంధువులు యాతనజెందగ స్నేహపాత్రులుఁ
శోకమునొంది తల్లిధరసోలగ చేయుట పాడియౌనొకో?

వః మామా కర్మలేదని జన్మలేదని వాదించుచుంటివే యిప్పుడంతయు ఆయిపోయిన వెనుక కర్మ జన్మ ఉన్నదని నీయంతరాత్మ చెప్పుచున్నదా?

సీః తలిదండ్రియాశల దహనంబుగావించి జీవితరక్షణల్ చితుకగొట్టి
దక్షిణ్యంబు కాలంబు తర్పణంబొనరించి మానాభిమానముల్ మట్టిగలిపి

గౌరవప్రదమును కడకాలనెగజిమ్మి పెండ్లిపేరంటాల విలువచెరచి
పితృకుటుంబమువారి పేర్మినంతమొనర్చి సరివారిలో కీర్తి సమయజేసి

తే॥ పౌరుషజ్ఞాన కీర్తులపారదోలి
కాకివిధమున వేయేండ్లు లోకమందు
బ్రతికి ఫలమేమి? సుఖమేమి? లాభమేమి?
తెలివిగలవాడవే నీకుతెలియలేదె?

వ॥ ఔను శారదా తనకుతలతగిలిన బాధఇట్టిదని తనయాత్మయొ
ప్పుకొనునుగాని తగిలి యిట్లుండుననువారిమాట మూర్ఖుడెట్లునమ్మును?
తనకుతగిలినప్పు డొప్పుకొనును. దయ్యములులేవను వానియింట తల్లికో
భార్యకో పెట్టినగదా తానొప్పుకొనును! ఇతరులయింటనున్నప్పుడు
హేళనచేయునుగాని ఒప్పుకొనునా? శారదా!

తే॥ ఈడువచ్చిన కన్నియలింటనుండ
కాముకులనింటజేర్చిన ఘనతచెడదె?
గురుడు చంద్రుని యిలుజేర్చి కూలిపోడె
నీచులనుకాముకులచేర్చు నేకుటుంబి,

వ॥ మామా ఈనీతుల అవినీతుల యిప్పుడుపరిశీలించుచుంటివి ముం
దున్న నెంతోబాగుపడి సుఖంతువుగదా?

వ॥ ఔనుశారదా కర్మబద్ధుడనై అనేకమగు కడగండ్లపాలైతిని.
తలతగిలి తెలివితెచ్చుకొంటిని తెలివిగలుగువేళకు కాసులేని నిర్ధనుడ
నైతిని పీసమంతైన విలువలేకపోయెను ఇప్పుడెటుపోవుటకు వెనుక
నుయ్యి ముందుగొయ్యి అన్నట్లయినది. శారదా అన్నియుతెలిసి నీవే
యిట్లనియెదవెందుకు? యిటువిను-

చ॥ హరిహరులిద్దరుంగదిసి నడ్డమునిల్చి యెదిర్చిరేనియుం
మరలుపలేరుకర్మమును మానవులెంతటివారు చూడగం
హరి తనకండ దండయయి యన్నిటనుండగ నింద్రుడేడ్వడే
తిరుగదు ముందుకర్మ కడతేర్చినదాక మరెట్టివారికిం.

వ॥ మరియు.

ఉ॥ పల్లకిమోయరే ఋషులు? పర్విడిదాగరె యష్ట దిక్పతుల్
వెల్లెడ ధర్మమూర్తులయి యేడ్వరె నేడ్గురు చక్రివర్తులుఁ?
తల్లడమందరేమునులు? దానవశాసన బద్ధహస్తులై
చెల్లువుకర్మనుందు మన నేతలు గీతలు మోయనేవలెఁ.

వ॥ శారదా

తే॥ సతినిసుతునమ్మి యాహరిశ్చంద్రనృపతి
కల్లుమోయడె? కాటికి కాపుగాడె?
సతిని కానలవిడి నలచక్రివర్తి
కొలువు కొలువడె కుండల గోకిమనడె?

గా॥ మామా వచ్చినకార్యమేమిచెపుమా! మాటాడ నేనేర్తునే?
నీమాటల్ చవి తేనె సోనలగుచుఁ నిస్తబ్ధులఁ చేయుగా
సామాన్యుల్ తమనోటి కానగలరే? సాక్షాత్తు వాగ్దేవివే?
పామాణ్యంబులతోవచించు ప్రతిభావాక్ప్రౌఢి నీదేసుమీ.

వ॥ శారదా చచ్చినపాము నాడింతువా.

చ॥ మిగులదరిద్రునై తి మితిమీరు విలాస వినోదవాంఛలఁ
తగదని తల్లిచెప్పగను తప్పకదానినె చేసితీరుచున్
తగులగబెట్టితిఁ గృహము తాతలనాటిగనున్న క్షేత్రముల్
మిగులదు చిల్లిగవ్వయును లేదిక మోక్షము నెట్లుచూచినన్.

వ॥ మామా ఉన్నదై పోయిన ముందుజరుగవలసినదెట్లను ఆలోచ
నయే కలుగలేదా పగలే కటికచీకటి దాపురించెనా?

వ॥ శారదా జూదములోగల అభిరుచి నీకు తెలియదు ఎంతస్థిరము
నన్ను నైనను చితుకగొట్టును. ఈసారైనాకొట్టదా. ఈసారై నాతగు
లదా అనికొంత కాలము. ఎల్లకాలము యుక్లేయుండునా ఇకనై నా
అదృష్టముచేరిరాదా. అనికొంత కాలము. కాలముచూడడములో వే కట్ట
బట్ట తినతిండి కరువుకాల మూపన్నమాసు అయినది. యథార్థముచెప్పు

కొనెదను వినుము.

ఉ॥ చేసితి చేయరానిచెడు సేతలనేకము బుద్ధిహీనతన్
వేసితివేయరాని బహువేషములెన్నియొ నీచబుద్ధినై
మోసితి నింటియందు మనపూర్వుల యార్జన బోకబోతెలంగా
కాసునుచేయనట్టి గతిగల్గెను నేటికి అమ్మసాతుగన్.

వ॥ మామా తలిదండ్రినేడ్పించిన పాపమూరకబోవు ననుకొంటివా పూర్వజన్మమున తలిదండ్రిశాపాగ్నితో కమిలి, కుమిలి జన్మించినవారిని చూడలేద? కంటపడలేదా చూడకున్న యిటువిను.

సీ॥ పురిటింటనేతల్లి పరలోకమునకేగ నల్లాడు పిల్లలన్ నరయలేద
తల్లిచల్లనిచూపు తమకెందుకనకాక శోకించుపిల్లలన్ చూడలేద
చెంతచేర్చేడువారు చెయిజాచువార్లేక దీనులౌపిల్లలన్ కానలేద
కడుపుమంటలనార్ప గంజికానక యేడ్చు పసిపిల్లలేకంటబడగలేద

తే॥ వీరికెందుకు తలిదండ్రి దూరమైరొ
జ్ఞానదృష్టికి నందదా గానబడద
వీరు తలిదండ్రి శాపాగ్ని పేర్మిమున్న
ధరజనించిన పాపులు నరసిచూడు.

వ॥ ఔనుకారదా నిశ్చయమే పాపపుణ్యముల ననుభవింపకతప్పవు త్రిమూర్తులుకూడ త్రిప్పజాలరు. కర్మనంటి తిరుగుబుద్దిని ఎంతటివారైనను త్రిప్పజాలరు- తలిదండ్రి శాపాగ్నిలో దగ్ధుడనైతిని. తిరిగివారి యాశీస్సుల నార్జింపవలెనను తలంపుగలిగినది. కడకెట్లుపరిణమించునో తెలియదు. పట్టుమాత్రమున్నది-

వ॥ మామా ఈనీతులు బూతులు వగపులు వలపులు ఇప్పుడునేర్చుకున్న ఫలమేమి. లాభమేమి.

ఉ॥ పాకెడికాలమున్నయది సాకినవారల యాలుపిల్లలన్
పోకగనేమి నేర్వ[illegible] యనవెట్లుపోవలెన్

లోకముపోకడేమియను లోకములేక చరించియిట్టు లీ
శోకము తెచ్చుకొంటివిక సూక్తులుపల్కిన లాభమున్నదే.

వ॥ అయినను చెప్పుము విందము

వ॥ శారదా చెప్పుమనియెదవా అయిన విను.

సీ॥ ఆనాడులంకలో నందరుండిరిగాని నాకన్నమిన్న దానవుడులేడు
ఆనాడుకిష్కింధ నందరుండిరిగాని నాకన్నమిన్న వానరుడులేడు
ఆనాడువిరటుతో నందరుండిరిగాని యొకడునన్ మించు కీచకుడులేడు
ఆనాటియుగముల నందరుండిరిగాని ననుమించు దుష్టమానవుడులేడు.

తే॥ వ్యసనములనేడిటను పట్టభద్రినయ్యు
దిక్కుమాలిదిక్కు తెలియక తిరుగుచుండి
వచ్చియెదురైతి జీవచ్ఛవంబు భాతి
దాపునీకున్న పోదు పాతాళమునకు.

వ॥ మామా ధనమెప్పుడు చేజారెనో ఇక్కడున్నను పాతాళమున నున్నట్లే పోనక్కరలేదు. మామా గృహస్థుడు ఈజన్మలో వ్యభిచారి యైన మరుజన్మలో గృహిణి వ్యభిచారిణియౌనన్న ధర్మవచనము విన లేదా తెలియదా గృహస్థుడు అప్పుచేయుట గృహిణితీర్చుటయునా అన్నియుచదివి ఆయోమయములో పడితివెందుకు?

వ॥ శారదా వెనుదిరిగి జరిగినవన్నియు కనువిచ్చి చూచిన కడుపు చెరువగును.

చ॥ బ్రతికిప్రయోజనంబు గనరాదికభూమికి భారమేయగున్
వెతకినగానరాని యవివేకుడ పాతకసార్వభౌముడన్
పతితులపజ్జచేర్చి మదుపానమునిచ్చిన దానకర్ణుడన్
బ్రతుకునుబాడుచేసి పలుపంచల పండెడి పట్టభద్రిడన్.

వ॥ మామా ఇప్పుడుచింతించి ఏమిప్రయోజనము ముందుండి యుండిన సుఖముండియుండును.

చ॥ నడవడిచేతమానవుడు నల్వురిలోఁ జిరకీర్తిఁ నొందనౌ
నడవడిచేతమానవుడు నల్వురిలోనపకీర్తిఁ బొందనౌ
నడవడిచేక దానరుని నాణ్యము హెచ్చుట తగ్గుటల్ గనన్
నడవడిచంపుకొంటివిక నాయనువారెవరుందు రీధరన్.

వ॥ ఔను శారదా నడవడిచెరుచుకొన్న మానవునికి యిహపరములు రెండుచేడును యిహమున అగౌరవము పరమున పదభ్రష్టత్వము తప్పక దాపురించును.

వ॥ మామా నేనిట్లంటినని కోపక విను.

ఉ॥ సోమరిగుంపుగూడుకొని చూచిన ప్రాజ్ఞులు దుర్నయుండనన్
నేమరియాదకెక్కక మరెంతగ పెద్దలు చెప్పిచూచినన్
నీమము తప్పిపోతిరిగి నిగ్గిన సేతల నూహ సేయుమా
యేమనిచూతురో సుజనులేమని పిల్తురొ గౌరవింతురో.

వ॥ శారదా బంధుమిత్రులు గ్రామప్రజలు ప్రీతిగాపిలుచుట గాని ఎదురైన నాముఖము చూచుటగానిలేదు. ఎదురైతినా తలవంచుకొని ప్రక్కనపగ్గముదూరములో నైతొలగి పోవుదురు కర్మజాలక ఏమనునో ఏమడుగునో ఎట్లుమారునోయని భయము. కొందరు ప్రక్కదారులబడి పనిగలిగినట్లు పోవుదురు. ఆనాడు పనిలేకున్నను పనికల్పించుకొని ప్రక్కకుపోబోయినను పోనీయక మాట్లాడుచుండిరి. ఈనాడిట్టి వైపరీత్యముగలిగినది ఇదినావిధి ధనమున్నవాడుధాత ధనములేనివాడు దూత అన్న మాటసత్యము.

వ॥ ఔనుమామ.

ఉ॥ ధనమును విద్యయుఁ బదవి తాతలనుండియు వచ్చువృత్తియుఁ
మనుజుని పెద్దచేసి భువిమార్గముచూపును ముందుపోవగఁ
ధనమును విద్యయుఁ బదవి తాతలనుండియు వచ్చువృత్తులఁ
మనుజుడుకూర్చుకున్న నవమానము న్యూనము తప్పదారయఁ,

చ॥ నిజమది నేనుకుంటకనయినీల్గితి కాలముప్యర్థపుచ్చితిన్
కుజనులతోడదిర్మ్మరితి కూళలస్నేహము కోరిచేసితిన్
సుజనులనెంతొచుల్కనగ చూచితి బుద్ధినిగోలుపోతి నా
యజులిఖితంబు పోదుడువనౌనె తలంపగనెట్టివారికిన్.

వ॥ మామా బ్రహ్మవ్రాతయందురుగాని బ్రహ్మయేమిచేయును చేసినది విధించునుగాని చేయనిదివిధింపగలడా మిత్రుడొకడు శత్రుడొక డుండునా తానొనర్చి బ్రహ్మనుదూషించుట పాపముపై పాపము చేసి నట్లగునుకదా.

వ॥ ఔనుశారదా బ్రహ్మననుకొనుట లోకవాడుకైపోయినది. ఆజీవి ఏదిసంపాదించెనో అదిలిఖింపగలడేగాని వేరులిఖించుటకు వీడాయ నకు శత్రుడా? యింకొకడు మిత్రుడా? ఎంతకష్టమో అంతకూలియుం డునుగాని పైపై పచారుచేయువానికి కూలి ఎవ్వడిచ్చును॥ శారదా నాచేసినవి మరికొన్నిచెప్పెదను విసుగుజెందక యాలకింపుము.

సీ॥ ఊరుదిర్మ్మరుటలో నుబలాటమున్నట్లు చదువుపైలేకనే సన్నమైతి
ఇస్పేటు సీట్లుపై యిష్టముండినయట్లు భాషపైలేకనే దోషినైతి
సినిమాలకుబోవ మనసుసోలినయట్లు పాఠాలపైలేక పతనమైతి
నవివేకమున మనస్సతికిపోయినయట్లు సద్వృత్తినతుకక చవటనైతి
తే॥ వినకతలిదండ్రినుడి యవివేకినైతి
నిలువకను గురునాజ్ఞలో తులువనైతి
పలువలనుగూడి జీవచ్ఛవంబునైతి
నక్కడిక్కడ నెక్కడ నెక్కనైతి.

వ॥ మామా అదివయోగర్వముకదా యౌవనకాలములో యిహ పరములు కనరావన్నమాట నిజమేకదా? యౌవనకాలములో అవనిం దలపాలుగాక పెద్దలచేదూషింపబడక పేరుప్రఖ్యాతిని చెరచుకొనక ధనము దుర్వ్యయముచేయక విద్యాకాలము వృథాచేయక గమ్యస్థాన ముచేరి కుటుంబికుడగు వరకున్నకాలము యుగసంధియున్నట్లుండును

కూరికా ఉపదర్శివమున్నట్లుండును ఇక్కడనే నూటికి పాతికమంది పద భర్తృష్టులై ఉట్టికి స్వర్గమునకెక్కక నుభయభ్రష్టులై ... చెడి వివాహాపు విలువ చెరచుకొని దుఃఖించువారు. కాని వినుము.

సీ॥ సాధుసజ్జనసంఘ సహవాసములుమాని సోమరులఁజేరి కుంఠనైతి
తలిదండ్రి సద్గురు పలుకులనెగజిమ్మి కూళలజతకూడి కుమతినైతి
సత్ప్రవర్తనముల సమకాలికులు తెల్ప ఛీ పొమ్మటంచని చెడుగునైతి
పిలిచిపెద్దలుచెప్ప పెడచెవిఁబెట్టియు దుండగులఁగూడి ధూర్తునైతి

తే॥ నైతినెట్లెట్లొ నైతినేనైనదిపుడు
తలపునకురాగ శోకంబు తరుగబోదు
పెద్దలనుగన్న తలయెత్తబుద్ధిపోతు
విన్నదలచిన దుఃఖంబు నిలుపరాదు.

వ॥ మామా (నవ్వుచు)

ఉ॥ ఔను మరేమిచేయనిపుడౌను సకాలము కాలమాయెగా
మానవధర్మముల్ తెలుపు మాన్యులచెంతనజేరి దైవముఁ
పూనికతో న్మరించుచును ముందుకుకాలిడు సౌఖ్యమబ్బెడిఁ
బనది యైనదేదొ యిపుడైనదిపోవునె యంగలార్చినఁ.

వ॥ మరియు

చ॥ ధనమె జగానమానవుని దైవసమానునిగాగజేయ నా
ధనమెవనొద్దనుండినను దైవసమంబుగ చూతురాతనిఁ
ధనమునగల్గుసౌఖ్యములు దానిమహామహిమప్రభావమున్
వినవె గురుండుచెప్పడె వివేకముగల్గదె యూహకందదే.

వ॥ శారదా నాబుద్ధికినందనిదేదియులేదు కర్మవశమున గోతిలో పడి గోతినుండి వెలువడుటెట్లయని ఆలోచించి కడకెట్లో వెలువడితిని ముందున్న ఉన్నతస్థితినందుకొనుటకై యోచించుచుంటిని.

వ॥ మామా.

తే॥ ద్రవ్యముగా విద్యరూపు పిత్రార్జితంబు
నున్నతోద్యోగమును వృత్తియున్నవాని
బ్రహ్మకొడుకండ్రు ప్రజలు నివ్వసుధయందు
పూర్వపుణ్యంబునగా వీరు పుట్టుచుంద్రు.

ఆ॥ రాజభాషలేక రాణించగాబోదు
మాతృభాషలేక మనిసి కాదు
రెండుసున్నయైన బండయౌబ్రతుకౌను
రెండుగలిగియున్న నందుసుఖము.

వ॥ ఔనుశారదా నిజము. నీవన్నవన్నియు కలిగి కర్మప్రభావమున మరుగైనవి కర్మకాండనుండి కన్నుదెరచి కాలుబైటపెట్టితివి ఇకనాకర్మ నన్నంటజాలదు విడిపోయినది. ఉన్నతస్థితి తప్పక నందుకొనెదను. భాగవ్యస్థానము నే చేరుకొనెదను ఇదినాయాశయము.

వ॥ మామా,

చ॥ అరయగ వేషభాషలు సమన్వయమందక పోయెనేనియున్
పరువునసించు నల్వురను ప్రాజ్ఞులు మెచ్చరు భాషనేర్చినన్
మరిమరిచూతురాతనిని మాన్యులు మెత్తురు గౌరవంబగున్
గురువరుడున్ సఖుండు బవకుండునివన్ వివరింపలేదొకో,

వ॥ అదియుమగాక మామా,

క॥ వేషమునకు తగుభాషయు
భాషకుతగువేషమున్న పరికింపనగున్
భాషయువేషము కుదరని
దోషము పరిహాసమునకు త్రోవనగూర్చున్.

వ॥ ఔనుశారదా వేషమునకు తగుభాష భాషకుతగువేషము లేకున్న పరిహాసమేయగును శారదా,

ఉ॥ పెద్దలపల్కులెల్లనవి వేకములేయని గేలిసేయుచున్
బుద్ధిరవింతలేని పెనుభూతములం చనిభూలబాఱుచున్

బుద్ధినిమార్చుకొమ్మనెడి పూజ్యులనెల్లర రాలవేయుచున్
పెద్దలపాలిమృత్యువని పేరుగడించితి కీడుపొందితిన్.

వ॥ అదియుగాక.

చ॥ జననుతమైన వంశమును శక్తికిమించిన జ్ఞానసంపదల్
కనులకునింపుసొంపెసగి కాంచన సన్నిభమైన దేహమున్
ధనమును భాగ్యహంబులను నాశమొనర్చి వికారినైతి నిర్
ధనికుడు నేమిజుఱ్ఱుకొన బాబ్రతుకంగవలె ధారుణీస్థలిన్.

వ॥ మఱియు,

చ॥ ధనమును విద్యగౌరవము తాశ్రమకోర్చి కూర్చుకుండినన్
మనుజునికుండునే సుఖము మార్గముకల్గునె ముందుపోవగన్
జననమువ్యర్థమేయనుచు చచ్చినదాకను దుఃఖవారిధిన్
మునుగుచు తేలుచుండుగద పుట్టిన ప్రయోజనమేమి యీధరన్.

వ॥ మామా ఇప్పుడుచింతించి ఫలమేమి,

చ॥ కలుగగజాలుగంతలను కానవలెగా తగుపూర్వపుణ్యముల్
కలిగినవారికన్గొనియు వాకవికావశవరచుచేద్బవన్
కలుగునె దైవమీగలడె కల్గిసుఖంచెడి త్రోవలున్నవే
కలిగినకర్మ వోడుడిచి కాగలవిచ్చు మహాత్ములుండిరే.

వ॥ మామా.

ఆ॥ ఐనదేదొగడచి యైపోయెనిప్పుడు
నడువవలసియున్న నడకయేమి
ముందుగతులనెట్లు పూరించుకొనవలె
చోటుదొరికినంత చూడవలదె.

వ॥ కొనుకారదా జీవితరక్షణోపాదులకొరకై యోచించి త్రోవ
గానక ఈత్రోవకువచ్చితిని,

ఉ॥ పాకినవారినేమరచి పాకెడివారల వెంచకేమదిన్
పోకిరి యేకిలైతిరిగి పొల్పును బల్పును గోలుపోయితిన్

నాకికఁ దోవచూపు కరుణామయు లెవ్వరు నీవుగాక నా
శోక మశోకమౌనటుల జూడుము నీకు శుభంబు గల్గెడిన్.

వ॥ మామా మానవులకు త్రోవచూపునవి అదృష్ట దురదృష్టములే మానవులు కారణమాత్రులు. మానవులేమిచేయగలరు అదృష్టమున్నపుడు చక్కనిదారిచూపు వారెదురౌదురు. దురదృష్టమున్నపుడు చెడుదారులచూపు వారెదురౌదురు నీసుకృతదుష్కృతములే కారణములు గమనించిచూడుము.

వ॥ శారదా అదృష్ట దురదృష్టములటుంచి ప్రకృత కాలము గమనించి నాకుదారిచూపుము.

లేదుతినంగఁజాలు సిరిలేదు వినందగు గొప్పవిద్యయున్
లేదుసురూపసంపదయు లేదుమహోన్నతమైన వృత్తియున్
లేదుగడింపగావదవి లేవువివాహపు నాలుగంకలున్
కాదనియిచ్చువారెవరు కన్యకనంకలు నాల్గుతగ్గినన్.
కాదిననీవె కావవలె కన్పడరెవ్వరు బంధుకోటిలో
చూచిననీవెచూడవలె చూడగలేరిక చూపుమేరలో
నీచునిగామదిన్ గనక నీచెయి నాచెయియుంచితేని నీ
గీచినగీటుదాటక సుఖంతును నిత్తును పంచప్రాణముల్,

వ॥ మామా చెప్పుటసులభము చేయుట మహాకష్టము నీవిప్పటికైనను పూర్వపుత్రోవల పోవకనిల్చిన తిరిగి నీగమ్యస్థానము నీవుచేరి సుఖంపగలవు, పారాయికాగినవానిమాట సత్యమౌగంగమ్మ అన్నట్లు నీసత్యమెంతవరకో తెలియదు. నీగీచినగీటులో నిలువతగిన మేరకోడలి యెదుట నీగీచినగీటుదాటనని నీకర్మము నీనోటపలికించుచున్నది. కర్మదేవత సిగ్గువిడియముల చంపి సింహాముసు గాప్రముసింహాసుగచేయును, కర్మకున్నశక్తి అపారవారము. దీనిదాపు మహామహులెవ్వరులేరు.

వ॥ శారదా దుష్కర్మకాండదాటి సత్కర్మకాండలో ప్రవేశించితిని యిక వెనుతిరిగిచూడను యిటుపిను.

ఉ॥ పోవనుదైవసాక్షిగను పూర్వపుతోవ్రవల- అమ్మసాక్షిగా
పోవనుజూదమాడుటకు బొత్తిగపోవను వేశ్యలిండ్లకున్
నీవెటునిల్వమన్న నటునిల్తును కొల్తును దేవిరీతిగా
నావగపున్ హరించి కరుణామయివై దరిజేర్చుశారదా.

శా॥ మామా నాతలపే తలంపక మదిన్ మాంద్యుండవై యిప్పుడీ
ప్రేమాలాపన కూనరాగములతో వేంచేసితో జానవున్
జామాతా దశమగ్రహంబనెడి యాసామ్యంబు లోకంబునన్
సామాన్యంబుగనున్న దేకద ఖలాసామ్యంబు పూరింతువా.

వ॥ శారదా బాల్యమాదిగ కంకణము ముడి తాళిముడి బ్రహ్మ ముడి మూడుముళ్లువేయకున్నను పెద్దవారు నీకొంగు నాకొంగు ముడి వేసి హోళ్యముచేయుట కని విని ఒకరిని ఒకరుచూచుకొని ఎంతో ఆనందించుచుంటిమి. ఆదరణతో నన్నుచూచుచుంటివి ఇంతలో కర్మవశాత్ కాలుజారిపడి రొంపికడుగుకొని నిలుచుకొంటిని తిరిగీ పడునని తలంపక ఆనాటిచూపు యీనాడుచూపి ఆదరించు. దశమగ్రహము సప్తమగ్రహము కాక పంచమగ్రహమునై ప్రకాశింతును. శారదా ఈజన్మలో నీఋణము తీర్చుకొనలేకపోయినను మరుజన్మలోనైనా తీర్చుకొనెదను. ముందుజన్మలో పురుషుడొనర్చిన దుశ్చేష్టల నవరించుకొని కాపురము నిలువబెట్టి పురుషునకాదరణయొసంగిన యువతులే ప్రకృతజన్మలో యెన్నిదుశ్చేష్టలొనర్చినా డొక్కలో ప్రక్కలోచోటొసంగి ఆదరణ చూపు పురుషులుండిరని తలంచు! తలంచిన కానబడలేదా.

వ॥ మామా కానబడకేమి కానబడనివారికి కానబడినప్పుడు కానబడువారికి కానబడద అయినా యిటువిను.

శా॥ మీమాహాత్మ్యము బావగారు వినరామీయక్క వీక్షింపదా
బామాభామహోత్మైన నీజనని కానన్నెట్లు నీకిమ్మనున్
నీమార్గంబటులాండెనాడు యిపుడా నీమార్గమిట్లుండెనే
వేమార్గంబున నిన్నుచూడమనెదో నీకేనిమర్శింపుమా.

వ॥ శారదా విమర్శించుకొనియే నీచెంత చేరితిని నన్ను నమ్మి ఈ విపత్కాలమున నాకాదరణయొసంగితివా ఆజన్మాంతముగాక మరుజన్మాంతముకూడా నీనీడలో నిలుచుకొని నీయాజ్ఞానువర్తినై నిన్నానందింపచేయుదును నమ్ము నామాట.

శా॥ మామా నాకధికారమున్న కదనే మాటాడి మాటివ్వగా
నా మీదన్ తలిదండ్రులుండిరికదా నావల్లనౌ కార్యమా
నామాటల్ కొనసాగునే విడుతురే నామీదనిక్కార్యమున్
సామాన్యంబగు త్రోవయానె చనగా సాధ్యంబె యోచింపుమా.

వ॥ అదియుగాక.

తే॥ తల్లిదండ్రులమదిలోన దలచబోక
చేయిచేయిని నేనెట్లు వేయగలను
వారియాజ్ఞను పాటింప వలదె కన్య
తెలిసియిటులేల పలికెదో తెలుపుమామా.

వ॥ ఔను శారదా సదసద్వివేకము గలిగిన నన్ను సర్వనాశనమొనర్చినదీ కర్మదేవత. శారదా అధఃపతనమైపోయిన నన్ను రక్షించిన పుణ్యము నీకిహపరములలో అండదండయై కాపాడును ఆదర్శమానిని యందు చేరివన్నెగడించెదవు ఏనాటికైనను జరసంభవింపక మానదు చావు, సిద్ధించకపోదు. యిటనిల్చునదికీర్తి అటకొచ్చునది పుణ్యము పాపమొనర్చికదా నేనధఃపతనమైతిని పుణ్యమొనర్చియేకదా నీవు ఆదర్శయువతివై అందరునై యనునట్లు అంతరిక్షమున బోధమునిర్మించితివి.

వ॥ మామా,

ఉ॥ ఆయువుపట్టు కన్నియల కన్యముగాదు తలంప శీలమే
నాయువునైన శీలమును యన్యులకై వసమొందజేసినన్
మాయదె కీర్తిగౌరవము మాతనిరంతర మేడ్చికూలదే
శ్రీయముగల్గుచే భువినిశీలము కన్యక గోలుపోయినన్.

వ॥ కొనుకారదా పెద్దవారినాశ్రయించిన కార్యమగునా వారి యాశలదీర్పవగునా

సీ॥ విజ్ఞానసంపత్తి విద్యావిశేషంబుగలుగు నల్లునిగోరగలడుతండ్రి
భూషణాంబరములు భూధనధాన్యముల్ గలుగునల్లునిగోరగల్గునమ్మ
ఘనతయుబలగంబు వినయంబుసత్కీర్తి గలుగుబావను గోరగలుగునన్న
తెంపుబల్ పెంపును దేదీప్యమానంబుగల మరందిని గోరగలదుభగిని

తే॥ చెల్లియలు సోదరులు బావచెలిమిబలిమి
కోరుదురు కన్యమన్మథాకారుగోరు
వరుడు నిందరి నొప్పించువాడుగాను
పుట్టవలెనన్న సాధ్యమా భువినిదివిని.

వ॥ మామా ఈవిజ్ఞానమా నాడెట్లుపోయెను యిటువిను.

ఉ॥ నాలుగుహంగులున్ గలిగి నాణ్యముగల్గిన వానికివ్వరే
నేలుకొనంగకన్నియల నెంతటిరూపసిరైన యొప్పరే
కాలముకాలధన్ని వయికాలగతుల్ గనునించబోక దుష్
కాలమటంచు నేడ్వగని కన్యకనిత్తురె కానులిత్తురే.

వ॥ మామా కన్యపరము వారొక్కరే కాదికోర్కెగోరుట వరుని పరమువారుకూడా కోరెదరు యిటువిను.

సీ॥ పద్వంశసంజాత సద్గుణంబులఖని వధువుకావలెనను వరునితండ్రి
శాంతస్వభావయు సకలకార్యధురీణ వధువుకావలెనను వరునితల్లి
సౌందర్యసౌశీల్య సౌకుమార్యముగల్గు వధువుకావలెనను వరుడువిధిగ
పేర్మిసుస్వరూపిణి ప్రియవాక్యభాషిణి వధువుకావలెనండ్రు బంధుజనులు

తే. సోదరులు కోరుదురుచాల సుగుణవతిని
అక్కచెల్లెండ్రుకావలెనండ్రుసాధ్వి
యిన్నిసుగుణంబులన్ గూడి యున్నకన్య
బడయవలెనన్న సాధ్యమాబ్రహ్మకైన.

వ॥ ఔనుసాధ్యముకాదు అట్లనిప్రయత్నము మానుకొందురా నేనుచేసినపుణ్యామింతేనని తలంతురా యిక కాదని నిర్వ్యాసనపడినంతవరకు సాధింపచూతురు. ప్రప్రథమముననే ఆశను నిరాశచేసికొందురా,

వ॥ ఔను కర్మమునుకాదని కైలాసముపోవ ప్రయత్నముమాత్రము మానవులుమానరు.

ఉ॥ రూపము విద్య శీలమును రొక్కమురిచ్చెడి శక్తిత్యాగముల్
సేవనిరైయనచేయదగు నేర్పునుకూర్పును యోర్పుగల్గి ము
క్కోపము లేనికన్యకల కోరుచునుందురు నెల్లవారలుల్
పాపులకెట్లు లభ్యమగు ప్రాప్తముగావలె గాలభింపగన్,

వ॥ శారదా అట్లయినబుద్ధిని మార్చుకొనియెదను యెందుకిక యిటువిను-

కం॥ ఇచ్చటనచ్చట శెక్కని
తుచ్చుడనై పోతినింక దొరుకవుశుభముల్
స్వచ్ఛంబగు మునివృత్తిని
ఖచ్చితముగనుందు నీవుకాదన్ననికన్.

వ॥ మామా వద్దువద్దు దండముబట్టి దండధరుడవుకావద్దు కోదండముబట్టి శ్రీరాముడవుగావద్దు బ్రహ్మదండముబట్టి మహాయోగివిగావద్దు యిటువిను.

తే॥ బాల్యసన్యాసముల్ బాడబాగ్నియొకటి
బాడబాగ్నినిచేబట్టి బ్రతుకగలదె
బాల్యసన్యాసమున బాగుపడగగలదె
బుద్దినూహించి చూడుమా ముందుగతుల.

సీ॥ పాకశాసనుకథల్ పరికించియెరుగవా మోయదేమేషాండములనువిధిగ
చంద్రునికథనీవు చదివినదేకదా క్షయరోగమునవచ్చె సగముగాదె
పారాశరునికథల్ పరిశీలనమొకా కామమ్మాపగలేక ఘనతచెడదె
గరళకంఠునికథల్ గాలించినావెగదా కామాంధుడను పేరు గాంచగలేదె

తే॥ స్త్రీలకేరిగంటిమాపులో చిత్తుగాక
జరితికిపోలేరు వారెట్టివారలైన
వ్యాసమునిరీతి పుట్టించి భారతంబు
వాడదలచిన నాటకంబాడుమామ.

వ॥ మామా యిదియిట్టులుండనిమ్ము సన్న్యాసమనుచుంటివి వారి జన్మప్రకరణము తెలియక వారిపూర్వజన్మఘట్టము కొంచము విని పింతును వినుము.

సీ॥ ఇంటనిల్లాలేడ్వ కంటనేచూడక కులటలతోకూడుకొన్నఫలము
నమ్మినసతికంట దుమ్ముకాలిచికొట్టి పరులతోకులికిన పాపఫలము
వాల్గుగోడలమధ్య నట్టింటనతినీడ్చి పడరానిపాట్లెల్ల పడినఫలము
పెండ్లిపరిమాణాలు పెనుగాలికెగరూది ధట్టించితెగకొట్టినట్టిఫలము

తే॥ కరుడుగనుగట్టి తనవెంట కదలివచ్చి
భూతమైసన్న్యసింపంగ బుద్ధిపొసగి
కామవహ్నిని పడగొట్టి కరుగబోయు
వీరుదురదృష్టులైనట్టివారుపృథివి.

తే॥ సురతసుఖమునకై సచ్చిసున్నమౌచు
మనసునీడ్వంగ దుఃఖాబ్ధి మునిగి మునిగి
కడకుతలవాల్చుజీవుల కలిసినీవు
సన్న్యసింతువ నీకేమి సన్న్యసింప.

వ॥ శారదా వీలులేక సన్న్యసించుచుంటివి గాని వీలున్నసన్న్యసించు వాడనుగాను. వీలులేకనే అందరుసన్న్యసించుచుండిరని తెలియుచున్నది. వీలుగల్గిన చేడియచేదనువారొక్కరులేరు. ఇదంతకుష్కవేదాంతము లేకమెట్టవేదాంతము.

తే॥ రంభతలధమ్మ కన్నియ లభ్యపడిన
వాకమదిరొంల యాబ్రహ్మలోకమేల

మూడులోకాల నిక్కడేచూడవచ్చు
చిక్కవలెగాని చేతికి ప్రిక్కవిడునె,

వ॥ మామా నీసంగతి అడుగవలెనా అడుగకనే తెలియుచున్నది కదా! మామా సన్యసింపక,

తే॥ తగుప్రియత్నంబు సాగించు ధైర్యముగను
దైవమున్నాడు నాపైన దారిచూప
శుభమొ నశుభంబొ కడకట్టు చూడబోక
కూలబడిపోవగానౌనె కోవిదుండు.

వ॥ శారదా శుభమెట్లుకలుగును నశుభదేవత తాండవించుచుండుట కంటికగుపడుచున్నదికదా.

చ॥ శుభమెటుగల్గు సౌఖ్యములు చూరగొనంగ నవెట్లువచ్చు నా
శుభఫలదుండదెట్లు ననుజూచుదయారన ముప్పతిల్లగా
శుభఫలదాయివీవెయయి చూచినదాక సరోరుహాన నా
ప్రభుదయ నీదయే నిజము వజ్జనచేర్పుము ప్రాణమిచ్చెదన్.

ఉ॥ మేనరికంబుధర్మమని మిక్కిలినొక్కవచింప విన్నదే
దీనిని నీమదిన్నునిచి తెంపుగ చెంతకుచేర్చితేని నన్
పూనికతో త్వదీయరుణమున్ హరిసాక్షిగదీర్తునమ్ము మా
దానవనాథుడైన బలిదానముగా నిదికీర్తినిల్చెడిన్.

వ॥ మామా మేనరికము చేజేతుల చెరచుకొని నమ్ముకొనియున్నవారినిచెరచి యిప్పుడు మేనరికమనిన ఆకసమునుండి అట్టెదిగివచ్చుననుకొంటివా.

ఉ॥ ధర్మము ధర్మమంచు ననుదాపునజేర్చుట న్యాయమంచు నా
కర్మముకాలెనంచు మరికన్యవు నీవధికారివంచు నా
ధర్మమువంకచూడకను దాపడగోరుట ధర్మమౌనె నా
కర్మమునిట్లుకాలెనని కాగలదానని కాచియుండుమా.

వ॥ మామా ధర్మమడుగంట బ్రివర్తించిన పశుత్వము సంభవిం

వక మానవత్వము నిలచునా యిటువినుము.

సీ॥ కనిపెంచియెన్నెన్నోకష్టాలకోర్చిన తల్లిదండ్రులమాట తలపవలద
మాచెల్లెలనియెంతో మమతతోపెంచిన జ్యేష్టులమదిలోన జేర్చవలద
తండ్రివంకన మరి తల్లివంకనగల్గు వారిగౌరవము కాపాడవలద
వంశవారిగవచ్చు వంశమర్యాదల సూటిగాపాటించిచూడవలద

తే॥ కన్యయధికారియౌనని కావరమున
వారియాశల కాల్దన్ని వారివిడువ
ధర్మరహితంబునౌ పెడదారిగాదె
వలదుచేపట్టు వత్తు వైవాహికమున.

వ॥ వైవాహికమా వల్లకాడా నక్కెక్కడ నాగలోకమెక్కడ. నీవుచెడినదిగాక నింకొకరిని చెరుపబూనితివా ఛీ బుద్ధిలేదందురు— నీయడుగుజాడలలో నడుచుటకుకూడ నర్హతలేని నేనెట్లు నిన్నిమ్మని పెద్దవారినడుగుదును. నక్క నాకలోకమేగ ప్రియత్నించినట్లుండును. ఇదౌనా కారదా!

వ॥ ఔనుస్త్రీప్రియత్నములేమియుండును. జలచరములుపోలేదా భూచరములుపోలేదా మానవులెందరోపోలేదా నీవుమాత్రము యెందుకుపోలేవు ప్రియత్నించిన పోవచ్చును యింకొంచమువినుము.

సీ॥ నానారుచులగోరు నాల్కనుబంధించి పత్తెపత్తెము లుండబడినదమ్మ
ఆదివగలదిచ్చి తనప్రాణమునకన్న మిన్నగాచూచిన కన్నతల్లి
బిడ్డలయశముకై పెనుబాధలనుబడి మమతతోపెంచిన మాతృదేవి
ఎన్నెన్నొకష్టాల నన్నియుతొలగించి చూపెట్టికాచిన సురభిజనని

తే॥ అష్టకష్టాలకోర్చిన యమ్మకొక్క
లడవిపాల్జేసి వందరివకైవిడచి
జారుకున్నట్టి కన్యకు జన్మకలదె
కన్నవారేడ్పుకాల్పదా యున్నదనక.

తే॥ చెల్లియండ్రకు నిదికడుచేటుదెచ్చు
యశముగలవంశమున కపయశముదెచ్చు
యన్నదమ్ములకిది మృత్యువనగనచ్చు
కన్నియలు జారలయ్యెడి కారణములు.

వ॥ ఔనుశారదా ధర్మమేదైవము దైవమేధర్మము ధర్మపథమున నడచినవారిసొత్తే సుఖము- కాని ఆకలిగొని నధర్మములో కాలిడు బుద్ధిపుట్టినది నిజమే. దుఃఖమును సుఖముగామార్చగలనను ధీమావాలో నుండియే సధర్మమున నన్నురక్షింపమనుచుంటినినిన్ను ముందధర్మమైనను వెనుకధర్మముగమారి కీర్తిగౌరవములు నిన్నాశ్రయించి సుఖంపజేయును నమ్మునామాట.

వ॥ మామా నురియొక్కటివిను.

చ॥ వలసినదెల్లదెచ్చుచును పండుగ పర్వదినాలయందు కా
వలసినవెల్లనిచ్చుచును ప్రాణము ప్రాణమునైన తండ్రినిఁ
వలవలనేడ్వజేసి జననాదిగగాచిన మాతృదేవినిఁ
మలమలమాడజేసి తగునాప్రియుసెంబడిపోవ కన్యకుఁ.

వ॥ శారదా కర్మవశాత్ నుడిగుండమున బడిపోయితినిగాని కాగలవానివి వేనేకదా పరాయివాడనుగాదుచూడు. దీన నీకుకీర్తి వచ్చునుగాని అపకీర్తియేనాటికి రానేరదు. ధర్మమునుపాటించినదానవై జగద్విఖ్యాతినిగడింతువు నమ్మునామాట.

వ॥ మామా,

సీ॥ సాక్షాత్తులక్ష్మి మాశారదయని చాలప్రీతితో పెంచిన ప్రేమమయుడు
మాయమ్మమాతల్లి మారత్నములమూట యనిముద్దుగాబెంచినట్టిఘనుడు
పుట్టినింటికికాలు పెట్టినింటికివన్నె గడియించునని యాశపడినయశుడు
తినితినకేదెచ్చి తినుమంచుపెట్టిన కరుణార్ద్రహృదయంబు గలుగుతండ్రి

తే॥ కోర్కెలనుకూలదోప్రియు కులటనైన
కన్నతండ్రుల హృదయాలు కాలిపోవె

స్త్రీలకుండు నెవిలువ యీశిక్షితలమున
తెలిసియిటులేల పలికెదో తెలుపుమామ.

వ॥ శారదా పత్రికృతము వారియాశలు నిరాశలుగా భావించినను వెనుక ఫలించుననినమ్మి ప్రమాణముగా ఫలింపజేసెద నాకు యిప్పుడు చేయూతనొసగుము.

వ॥ మామా మరియొకటివినుము.

సీ॥ మతధర్మములనెల్ల మట్టిపాల్ గాజేసి కన్నవారలమాట కాలదన్ని
వావినివరుసల పతనంబుగావించి వంశమర్యాదలపాతిపెట్టి
బంధుమిత్రులప్రీతి పైకెగజిమ్మియు నమఖవిజ్ఞులనుడి నడవిగలిపి
ముందెట్టులనుమాట మొదలంటగాగాల్చి తోబుట్టువులపల్కు ధూళిగల్పి

తే॥ మోహమనుభూతమునకు దాసోహమౌచు
వచ్చినట్లెల్లవరుగిడు పడతులకును
హక్కులున్నవి మాకను నతివలకును
ముందుగతులున్నవే చూడ నిందునందు.

వ॥ శారదా నీవుచెప్పునదెల్ల నిశ్చయమేకాని వివాహము పెద్దవారిపైనిడుట వధూవరులు మృత్యుముఖమున బడినట్లుండు నను కొనెదను ఎట్లంటివా.

ఉ॥ కాలునుతొక్కి కంకణము గట్టెడివానికి హక్కులీక మాం
కాళినిబోలుదాని నొకకన్యను పెద్దలునిశ్చయించి యా
కాళికి తాళికట్టుమనగా విధివ్రాతగనెంచికట్టినన్
కాలము యౌవనంబు పిరిగల్గి వృథాకద జీవితాంతమున్.

వ॥ శభాస్ మామా కన్య కాలము యౌవనము పిరిసంపదలు మొదలుగాగలవి నీచేతనేయున్నవని తలంతువ.

వ॥ ఆ ఆ కాకు కాకు యింకకొంచెమున్నది పొంగముగ చెప్పనిమ్ము.

చ॥ కులమును గౌరవంబు సిరికొల్లగనుండెనటంచు చూచినన్
నలమలముచ్చుకోతిగను నాణ్యములో మునుచుప్పవాతిగన్
నలుపున మంగలంబుగను నాటుపురంబొకటొచ్చుచిచ్చుగా
వలవలయేడ్చుచున్ సుఖమువ్యర్థమటంచు తపింపశారదా.

తే॥ పొట్టిలో పొట్టియో చాలపొడవుగానో
నలుపుగనో లేక నలుపులో నలుపుగానో
నడ్డిగనో లేక నడ్డిలో నడ్డిగానో
తెచ్చిమెడగట్టి కట్నాలుతెచ్చుకొందు॥,

వ॥ మామా కురూపినిగాని సురూపినిగానితెచ్చుకొనుటకు నీయి
ష్టమనుకొంటివా నీచేతిలోనున్నదనుకొంటివా

చ॥ కలిగినపాపపుణ్యముల కంజజుడారసి వ్రాయునట్టివ్రాల్
కలమనుకొంటివా తుడువగా నదిపోదది యెంతదిద్దినన్
వలవలనేడ్వ దేవలయు వచ్చినకర్మల మోయనేవలెన్
నిలతలమోపుదాక నరునీడ్చును నూడ్చును పంచప్రాణముల్.

వ॥ మామా కన్యయనగా నీయింటి బంకమట్టియనుకొంటివా
తెచ్చుటకు యిచ్చుటకు వచ్చుటకు.

సీ॥ ఇల్లాలుపిల్లలు నిల్లువాకిలిభూమి పూర్వపుణ్యంబునన్ పుట్టుచుండు
ద్రవ్యంబు సద్విద్య తనుబలంబునుబుద్ధి పూర్వపుణ్యంబునన్పుట్టుచుండు
పదవిప్రాబల్యంబు బహుభాగ్యసంపదల్ పూర్వపుణ్యంబునన్పుట్టుచుండు
పాడిపంటసమృద్ధి బంధుమిత్రులప్రీతి పూర్వపుణ్యంబునన్పుట్టుచుండు

తే॥ పూర్వపుణ్యంబులో పూరిపుల్లలైన
జారిపోవక పైనెక్కిస్వారిచేయు
పూర్వజన్మంబు స్మృతినీకభోగములకు
వశ్యుచేయుమ భూతమైపట్టికర్మ.

వ॥ మామా సౌందర్య సౌశీల్య సౌభాగ్య సౌకుమార్యములతో
ధనకనకవస్తువాహనములతో వధువు తీరకబాధు యిచ్చుటకు॥.

ఆ॥ ఆ త్రిదేవుల నర్చించినట్టిఫలము
కన్యకాదానములవల్ల గలుగుఫలము
పూర్వమిల్లాలిచూచిన పుణ్యఫలము
వచ్చివధువయి ప్రాప్తించి యిచ్చుసుఖము.

వ॥ శారద

చ॥ తలచకయాత్రిదేవులను దానముసేయక కన్నపుత్రికన్
వలపునధర్మమార్గమున భార్యనుచూడక ముందుజన్మలో
కలుగద కన్యకీధరను కాద వివాహము లేదసౌఖ్యమున్
తెలుపుము తేటతెల్లముగ దీనిమహాత్మ్యమువిందు వీనులన్.

వ॥ మామా.

చ॥ తలచకయాత్రిదేవులను దానముసేయక కన్నపుత్రికన్
వలపునధర్మమార్గమున భార్యనుచూడక ముందుజన్మలో
కలుగదుకన్యకీధరను కాదువివాహము లేదుసౌఖ్యమున్
తెలిసినతేటతెల్లమిది దీనిమహాత్మ్యము వింతెచూడగన్.

వ॥ శారద.

ఆ॥ కలుగగలదె కన్యకాదానఫలమును
ముందుజన్మకిద్ది యందుకొనమవె
కట్నములనుకన్యకై కొనువారలు
నప్పుదీర్తురంచు చెప్పగలవ.

వ॥ మామా ఔనుచెప్పగలను.

కం॥ దానమునిచ్చినకన్యను
దానముమరుజన్మకిచ్చు తగునిల్లాలిన్
దానముసేయక కన్యను
మానవులిలపొందగలుగు మార్గముగలదే.

కం॥ కన్యాదానమొనర్చిన
ధన్యులకేలక్ష్యమగును దాకాధనముల్

యన్యుల కెటులభ్యంబగు
కన్యకయును కట్నములును కల్యాణముతోన్.

కం॥ వరదక్షిణవడ్డీతో
మరుజన్మకువచ్చునిచ్చు మరువపు మొలకన్
స్థిరచిత్తంబున నొసగిన
నరుడేగై కొనెడివాడు నానావిధులన్.

వ॥ శారదా ప్రకృతము దండిగావరకట్నములు గ్రహించుకొనువారు సురూపవతుల వివాహమాడువారు అత్తవారింటనే స్థాయిగనిలచి సుఖపడువారు ముందుజన్మలో వారువరకట్నములిచ్చి జీవితాంతము దోచిపెట్టినవారేనందువా.

వ॥ ఔను ఊరకేపూరిపుల్ల కూడరాదు.

సీ॥ లక్షలాదిగడబ్బు రాసులన్ బడబోసి కన్యలనిచ్చుట కానబడద
మళ్లుమాన్యాలిచ్చి మందిమార్బలమిచ్చి కన్యలనిచ్చుట కానబడద
చదువులన్ చెప్పించి పదవులన్ నిప్పించి కన్యలనిచ్చుట కానబడద
పట్లబల్వంతాన బహుభాగ్యములతోడ కన్యలనిచ్చుట కానబడద

తే॥ యిచ్చుచుండినదెల్ల ముందిచ్చినదియె
దుఃఖముగనిచ్చి సుఖముగాదోచుకొనిరి
పెట్టిపుట్టినవారికే పుట్టు నిచట
పెట్టకుండినవారికి పుట్టబోదు.

వ॥ శారదా పెట్టినందుకు పుట్టినదే సాక్షియన్నమాట వాస్తవమేయందువా లోకులాడుమాటలో నిశ్చయమున్నదందువా.

వ॥ ఔను ఆమాటలో వరమాణువు సందేహములేదు.

తే॥ పూరిపుల్లయుపోవక పొడుపుగలిగి
వచ్చువాపయువడ్డితో కచ్చితముగ
కట్నములు కన్యపోవునే కన్నుగప్పి
కన్నుగప్పినలో కాలు కాలిపోవె.

వ॥ శారదా మరియొకసందేహము.

తే॥ దానముగకన్నియలనియ్య తనకులేక
వాలుపేర్మిమించి తగురీతి నేలుకొనక
కొలుచురీతి త్రిదేవుల కొలుచుకొనక
యున్నవారలె పెండ్లిండ్లుసున్నయేన,

వ॥ ఔనుమామా ఔను.

తే॥ పెండ్లిపేడాకులేగాక పిల్లనీక
బంధుమిత్రులలో తలవంపులగుచు
బ్రతుకుపైరోసి నెటుపోవ త్రోవలేక
దినముయుగమయి యేడ్తురు దీనులగుచు.

వ॥ మరియు.

తే॥ ముందువెనుకలుగమనించు బుద్ధిలేక
జారులనుగూడితిరిగెడి శక్తిలేక
మన్మథావస్థలనుబడి మగ్గి మగ్గి
తల్లడిల్లుచు తపనతో చెల్లుకొందు్రి.

వ॥ శారదా పెండ్లిపేడ్లాకులేగానివారయ్యు మధ్యభార్యగతించి విధురత్వమే తెంచి అంతర్గతసన్యాసమో బహిర్గతసన్యాసమో అనుభవించుపురుషులు- భర్త గతించగా విధవత్వమావహించి అంతర్గతసన్యాసియయ్యో బహిర్గతసన్యాసియయ్యో దుఃఖమనుభవించుస్త్రీలు ముందుజన్మ పాపులందువా.

వ॥ మామానిశ్చయము అంతియే విను.

ఉ॥ మూలము లేక నీధరనుపుట్టుక దేనికిలేదురాదు మున్
మూలమునుండగావలయు పుట్టనుగిట్టను పెట్లుచూచినన్
మూలము లేనిపుట్టుకకు మూలవిరాట్పురుషుండుగావలెన్
మూలమెటీవకోటులను ముంచను తేల్చను కర్మరూపమై.

వ॥ శారదా మనోపవ్రివాహమెటుపోయిన నటుకట్టలను కట్టు

చుంటివి ఇక ఊసరవెల్లివలె రంగులమార్చుకొని జీవితనావనడుప ప్రియ
త్నింతును ఎట్లంటివా.

తే॥ అంగవైకల్యులై యుండునట్టివారి
కట్టుకొన్నను దండిగాకట్నమబ్బు
కట్నమునకొంతకాలంబు గడిపిపిదప
వసతియెటులున్న నటుబోదు వయినముగను.

ఆ॥ కుంటి గుడ్డి చెవిటిగూనివైయుండిన
మూగినడ్డి మడ్డిరోగియైన
కలిమిగలుగువారు కట్నాలతో కాళ్లు
కడిగినియ్యగలరు కన్నియలను.

వ॥ మామా శాకిలేని శాకిలెట్లిత్తురు. ఎట్లొచ్చుననుకొంటివి.

తే॥ అంగవైకల్యులైనట్టి యంగనలను
కట్నములుగోరకయె చాలకరుణతోడ
కట్టుకొన్నట్టినరులకు గలదుయశము
యశముగోనితెచ్చియిచ్చు సద్యశులవశుల.

వ॥ మరియు.

మ॥ వరకట్నంబులతోడ సౌఖ్యపడగా శాంచించిగైకొన్నచో
బరువైయేడ్తురు వచ్చుజన్మమునకుౝ వడ్డీలతోనిచ్చుచుౝ
స్థిరబుద్ధుల్ గమనించుశక్తి పరులుౝశిబట్టరిదర్‌వ్యముౝ
వరుడాసింపడు జన్మమున్నదనుచున్ భావించువాడైనచో.

వ॥ శారదాకుంటికురూపుల వరకట్నమాసింపక దయాదాక్షిణ్య
ములతో మాంగల్యధారణచేసి సలక్షణముగ పోషించిన ముందుజన్మము
నకు సర్వాంగసుందరి సలక్షణ లక్షితలక్ష్యమై సుఖపెట్టగలదందువా.

వ॥ ఔను మామా ఔను దానములో బహువిధములు ధనము
విద్య దేహము దేహకష్టము మొదలగునవి శానననుభవింపగలవి ఒరుల
కిచ్చిన పుణ్యాత్ములే ప్రకృతము సుఖించు ధన్యాత్ములు ప్రతియిచ్చిన

దేవచ్చును యివ్వనిదిరాదు యిటువిను.

సీ॥ పదిపదునారేండ్లు బహుముఖంబుల బెంచి గృహధర్మముల నెల్లగృచ్చిచెప్పి
కార్యకలాపాలు క్రిమబద్ధముగనేర్పి శ్రేష్ఠంబుగావంటచేయజెప్పి
పుట్టినింటికికాలు పెట్టినింటికికీర్తి తెచ్చెడివిధములు తెలియచెప్పి
కూలంకషంబుగా కులమతతత్వంబు పరమాణువులతోడ నెరుగచెప్పి

తే॥ సకలవిధముల నెరిగిన చతురమతిగ
కన్నియను జేసి కాళ్లనుగడిగి కన్య
చేయిచేతికి నందియ్య సిగ్గువిడిచి
కట్నమడిగెడి వరులకు కలదెముక్తి.

వ॥ శభాష్ శారద మంచిదెబ్బకొట్టితివి వరకట్నముతప్పైన ఓలి రూకలొప్పా మరిఅమాటచెప్పవే.

వ॥ చెప్పకేమి మామా ఓలితీసుకొన్నతలిదండ్రులు వధూవరుల కిరువురకు శాకీపడెదరు. అతలిదండ్రులకు ముందున్నది ముసళ్ళపండుగ ఓలిమాటటుంచు వరకట్నముమాట యింకకొంచెమున్నదివిను.

ఆ॥ పెద్దచిన్నలనక పీటపైనిలబెట్టి
కాళుకడిగితెచ్చి కన్యనిచ్చి
కన్యతోడ రొన్నొ కానుకలందిచ్చిన
ఆశతీరకడుగు నతడునరుడ.

వ॥ ఆశతీరకడుగు వరుడు నరుడుకాదందువ.

వ॥ వేననవలయునా నీకుతెలియదా.

ఆ॥ కాళ్లుకడిగి కన్యకాదానమిచ్చెద
కొమ్మటనిన కట్నమిమ్మటంద్రు
తెచ్చుకొన్న దేదొ తీర్చనేవలెనను
జ్ఞానదృష్టిలేదు మానవులకు.

వ॥ శారద దేనికీఆన్మకర్మమని మూలమని యనుచుంటివి ఇట్టి దుండునేమో కొంచముయిటువిను.

సీ॥ అత్తనోరెత్తిన మిత్తియై పైబడు మామమాట్లాడిన మారుకొనును
మగ డదేమన్నచో తగవులాటకుదిగి నడివీధికెక్కించి కడిగివేయు
వాడుబిడ్డలపైన నడుగడ్డునకురేగి విదిలించి యిల్లంత కదముత్రొక్కు
ఖావమరదులగన్న పండ్లెట్టిగొరుకుచు మెటికలవిరచుచు మీదికురుకు

తే॥ వదినమరదంద్రబిలుచు వాగ్వాదమునకు
సేవకులకెల్లపనిచెప్పి చిత్తుచేయు
యిరుగుపొరుగునగలవారి సరకుగొనదు
కయ్యమునకెప్డుకాల్దువ్వు కాళరాత్రి.

వ॥ శారదా ఇదియు ప్రారబ్ధమేనందువా,

వ॥ ఔను మూలములేని దేదియులేదు యిటువిను.

సీ॥ ప్రొద్దస్తమానంబు పొగలెల్లగ్రక్కుచు వదలించిపైబడు వత్తగారు
చేయకుండినతప్పు చేసినన్ తప్పని మంటలవెగజల్లు మామగారు
దండధరుండౌచు దట్టించితెగతిట్టి పాదమర్దనచేయు భర్తగారు
పనిమీదపనిచెప్పి బాధించివేధించి పండ్లూడదన్నెదు వదినెగారు

తే॥ వాడుబిడ్డలు మరదంద్రు వాడిపోపి
తప్పులనుజేసి చాడీలుచెప్పువారు
వారిబాధింపే నాపాయినచ్చితిరు
కాశిగనొ లేక యాతదరికాశిగానొ.

వ॥ మరియు.

తే॥ యిచ్చినదియివ్వనేవలె కచ్చితముగ
చేసినదిమోసికోవలె గాసియనక
జన్మజన్మాంతరములకు జారిపోదు
పెట్టినదికొట్టినది తమ్మువట్టికుడుపు.

వ॥ మామా కాలేజీలో చేరునప్పటికి యుక్తవయస్సువచ్చి రాక యుండునుకదా అందులో కొంతవరకు యుక్తాయుక్తజ్ఞానము- తాకు తప్పులు తెలిసి వర్తించుబుద్ధి— పెద్దపిన్నల గమనించి తిరుగుశక్తి- కొంత వరకు లోకజ్ఞానము- విద్యాప్రాబల్యము- కలిగి మంచిచెడ్డలగమనించి తిరుగువిజ్ఞానమున్నదికదా ఈదురభ్యాసము లెట్లలవడినవి- కర్మవల్లనా లేక పొగరుబోతుతనముననా!

వ॥ శారదా మంచికాలగతులలో నడచువారికి దుష్కాలగతులలో నడచువారు పొగరుబోతులుగా జ్ఞానహీనులుగా గన్పట్టుచుందురు. కాదు కాదు మానవులు కర్మాధీనులన్నమాట మరువకుము.

శారదా, కాలేజీనడవడికలు అందులోగల విలాసవినోదములు అందులోగల మహామహిమలు నీవనుభవించినవేకదా చెప్పనేల అయి నను కొంచెముచెను. కాలేజీలో నాలుగురకముల విద్యార్థులున్నారు. చదివేతీరవలెయును చదివి ఉద్యోగమేచేయవలయును. తలిదండ్రులు కష్టించి ఆర్జించినధనము వృథాచేయరాదు. పెద్దవారిఆశలు నిరాశలు చేయరాదు. జీవితపుసౌఖ్యముల చెరచుకొనరాదు. అనిపట్టుపట్టి చదువు చదివి ప్యాసగువారున్నారు. వీరుఘటికులు అఘటనఘటనాసమర్థులు పూర్వజన్మసుకృతజీవులు వీరికిఓర్పుండును నేర్పుండును.

సీ॥ చదువనేవలెనేను సహపాఠకులుమెచ్చఁ గనివవారలప్రీతి యినుమడింప
చదువుకన్యలుమెచ్చి సైకతాసనిబల్క బుద్ధిమంతుండని బుధులునుడువ
గురువర్యులెల్లరు పరమప్రీతిగచూడ సమకాలికులుగని సంతసింప
మంచివాడని ప్రజల్ మరిమరిపొగడంగ కన్యకామణులు వాల్గంటచూడ
తే॥ భయముభక్తియు వినయంబు బంధుప్రీతి
స్నేహపాత్రతగలుగు ప్రసిద్ధుడితడు
చాలడేయొక్కడైనను సద్వివేకి
కలిగిఫలమేమి పలువురు కలుషమతులు.

వ॥ అనివార్యజలముకొను మండ గమ్యస్థానముచేరువరకు పట్టువదలక

పట్టభద్రులగుదురు. వీరుప్రథమశ్రేణికిచెందినవారు అదృష్టవంతులు ఎందరెన్ని విధముల నడచుచున్నను ఏకమనస్కులై తనదారితాను చక్కగా చూచుకొనుచు గమ్యస్థానముచేరి మెప్పొందువారు సుఖపడువారు ధీరులు.

కం॥ ప్రాపుగనుండునువీరికి
జ్ఞాపకగ్రాహితపుశక్తి నానావిధులన్
ఓపికతో దాఁజదువును
భూపడువీడనుచు ప్రజలు పొగడుచునుండన్.

కం॥ జ్ఞాపకగ్రాహితశక్తులు
మోపుగవిద్యార్థికున్న పురికొనుచదువుల్
జ్ఞాపకగ్రాహితశక్తులు
ప్రాపుగలేకున్న విద్యబహుకష్టంబౌ.

వ॥ శారదా

ఆ॥ జన్మసుకృతమున్న జనులకుచదువెంత
జన్మఫలములేక చదువలేరు
ముందుజన్మఫలము నందుకొనినవారు
చదివిచేరగలరు పదవులందు.

వ॥ మామా ఈకోవకుచెందినవాడవేనా నీవు.

వ॥ శారదా యీకోవకుచెంది పిన్నపెద్దలలో పేరు ప్రఖ్యాతులంది కర్మవశమున దిగజారి దిగజారి పాతాళమునబడి దిక్కుదోచని విద్యార్థిని విను విను యిక మధ్యమశ్రేణికి చెందినవారన్నను అదృష్టముండియుండక బుఱ్ఱకుఎక్కిఎక్కక రాత్రింబవళ్లు చదివి చదివి దిగులుపడిపడి అక్కడికక్కడికి ప్యాసుమార్కులతో అయినానంటే అయినాననిపించుకొనువారు- వీరికిభయము భక్తి వినయము విధేయత కొంత పెరకుండును. చిల్లరఆటలలోచేరరు అదృష్టదేవతకు దాపులోనున్న విద్యార్థులు,

తే॥ తలచితలవక కొలిచియుకొలువకోక
నమ్మినమ్మక దేవుని నెమ్మనమున
ముందుజన్మంబునందుండి పుట్టినారు
జ్ఞాపకముగ్రాహితము చాలిచాలకుండె.

వ॥ గ్రాహితశక్తి జ్ఞాపకశక్తి జంటలేక విద్యార్థిముందంజవేయలేదు సాంగోపాంగముగ చదువలేదు ఉన్నతోద్యోగమును చేయలేదు. సమయస్ఫూర్తిగా ప్రజారంగమునందు ప్రభుత్వరంగమునందు వన్నెగడింపలేదు.

త॥ మామా గ్రాహితజ్ఞాపకశక్తులు సమయస్ఫూర్తిజ్ఞానము ఊరకవచ్చుననుకొంటివా ముందుజన్మమున దేవునినో దేవతనో కొలిచి తలచి యుండవలయును లేనివారికిలేదు, కాలేజీయందు కాలుపెట్టుటకుకూడా కాదు. పెట్టిసుఖములేదు.

ఆ॥ దైవశక్తిలేక తనశక్తితోవిద్య
నభ్యసించుటకును నలవిగాదు
శక్తివంతమైన శక్తిదేవునియందు
గలదటంచువరులు తెలియలేరు.

ఆ॥ దైవశక్తియొకటి తనయందుకలియక
వివిధకళలురావు విద్యరాదు
దైవశక్తియొకటి తనయందుకలసిన
వివిధకళలవెంత విద్యయెంత.

ఆ॥ ముందుచేసినట్టి పుణ్యమోపాపకృతంబు
తానుచేయుచున్న దైవబలమొ
తనకుయూతనిచ్చి దాటింపగావలె
యూతలేకదాట ఘాతతరము.

వ॥ ఔను ఔను శారదా ఔనమానవునియందు దైవశక్తికలియక శక్తిలేదు దైవశక్తినార్జించినవానిదేశక్తి- వానిదేయుక్తి- వానిదే

ముక్తి- వానిదేరక్తి- అనురక్తి సర్వస్వము వానిదే.

వ॥ మామా కష్టిఫలి అన్నారు పెద్దలు- కష్టపడక యేదీలేదు- కష్టపడి దైవారాధనచేసినవారిదేసుఖము. దైవమునారాధింపక ధర్మము ప్రతిఫలించి తన్నుమరలాచేరునను ఆశయములేక జీవించినవారే మగల నిర్ధనులు నిరతురకుతులు నిర్విరామములేని కాయకష్టజీవులు వ్యాధిగ్రస్తులు వ్యాకులచిత్తులు మామా.

కొలువక యేత్రిమూర్తులకు కొల్వక భక్తిని నాత్రిదేవులఁ
కలుగునెవిద్యయుఁ సిరియు కాంచనసన్నిభమైన దేహముఁ
తలచినవానికే యొసగు దైవమటంచని నమ్మబోక తా
చులకనగాగ్రహించుటకు చూచునుమానవు డెంత వెఱ్ఱియో.

వ॥ బ్రాహ్మీబ్రహ్మలవల్ల జ్ఞానము- లక్ష్మీనారాయణులవల్ల ధనము- గౌరీశంకరులవల్ల దేహసంపద- కలుగునని స్థిరప్రజ్ఞలతో ముగ్గురిని ధ్యానించినవారిదేసౌఖ్యము- వారివే యిహపరములలోగల సర్వసౌఖ్యసంపదలున్న ఇది తెలియక మతద్వేషులై సుఖములమట్టిపాలొనర్చుకొనుచుండిరి. ఒక్కటున్న మరొక్కటిలేక వ్యాకులచిత్తులై నిరంతరము దుఃఖించుచుండిరి నీకుతెలియదా,

వ॥ కొమళారదా త్రిదేవులను కొలువక త్రివిధసౌఖ్యములు లభ్యపడవు ధనమున్న విద్యలేక. విద్యయున్న ధనములేక విద్యాధనములు రెండుకలిగిన దేహబలములేక. దేహబలమున్న యౌవనబలములేక మానవులు లోలోన కుళ్లి క్రుంగిపోవుచున్నారు. త్రిమూర్తుల త్రిదేవులకొలిచినవారిదేసుఖము. ధనమునకు ననుభవించుశక్తి ధార్మికశక్తి- విద్యకు వినయగుణసంపన్నత- దేహమునకు బలము రూపము యౌవనము దీర్ఘాయువు తోడ్పాటయియుండవలయును త్రిమూర్తుల త్రిదేవుల నారాధింపవలయును లేకున్న త్రివిధబలములలో లోపించి లోపమునకు జీవితాంతము దుఃఖించవలసియుండును. శారదా భారతి బ్రహ్మలదలంచని దోషమాపాదించి సాహిత్యముండి సంగీతములేక ఎం

దరోకవులు దుఃఖించుచుండిరిచూడు. క్రిమబద్ధమైన ధ్యానములేకపో యిన కలిగెడి దుఃఖమిది శారదామహాతల్లివల్లకలిగినదేవిద్య. లక్ష్మీకటా క్షమునకలిగినదే కలిమి, గౌరీమహాతల్లిదయతో కలిగినదే దేహము, గాని అన్యులవల్ల లభ్యపడినవి కొంతవరకే రాణించును.

ఆ॥ జన్మసుకృతఫలము సమకూర్చుకొనివచ్చి
చదువుచున్నవారి చదువుచదువు
జన్మసుకృతఫలము జమలేకవచ్చిన
వారిచదువు చట్టుబండకాదె.

వ॥ ఔను మామా ముందుజన్మలో సుకృత దుష్కృతములు రెండుబలీయమై మీకుండినవన్నమాట లేకున్న ఇంతవిజ్ఞానసంపదలో అంతఅజ్ఞానమిమిడియుండవలయునన్న సామాన్యమా.

వ॥ ఔనుశారదా సుజ్ఞానము మానవుడు చేకూర్చుకొనుకొద్ది అజ్ఞానమువెర్రాడి తలదన్ని ముందంజవేయనీయకుండ తన్నుతాను కాపాడుకొనుట గొప్పకష్టము. ఇక్కడనేమానవుడు చెల్లాచెదరై చేయరాని పాపములుచేసి చెడిపోవుట దీనిశెరింగి వడవడిక నడరించు కొన్నవాడే మానవుడు కానిదేసుఖము.

వ॥ మామా మీరికోవలోచేరియుండితిరా.

వ॥ రామరామ లేదులేదు ఈకోవలో చేరియుండిన ఇంతకొం దరలో దరిద్రిదామోదర చక్రవర్తినైయుందునా కాను. ఉత్తమ మధ్యమ శ్రేణులకథ విన్నావుగా అధమశ్రేణికథ కొంచెమువినుగు తెందకవిను,

ఒరేతమ్ముడు తిమ్మాపురము తిమ్మడు యిటుచూడరా ఈపుస్త కాలు నీయెత్తు నాయెత్తు ఉన్నవిరా పదులపేజీలుకాదురా మూర్లపే జీలుగల పుస్తకాలురా జీవితాంతము చదివిన అయిపోవు అసలు అర్థ ముకాదు.

—: బుఱ్ఱ కథ. :—

బుఱ్ఱకెక్కునవి కావురో
మనకందుబాటులో లేవురో
మనప్రాణ మానములుతీయురో ॥ తందనాన
జీవితాలెబలియౌనురో
అబ్రిహ్మవ్రాయగా లేదురో
మనబుద్ధికందునవి కాదురో ॥తందనాన॥

వ॥ అట్లకాదురా వెంక వదరుబోతుకుంక.
తలిదండ్రిడబ్బులు దండుగ సై
జీతముబత్తెము దండుగ సై
పాఠ్యపుస్తకాలు దండుగ ॥తందనాన॥

వ॥ అట్లకాదురాదద్దన్నా మొద్దుపెద్దన్న.
కోటిలోడబ్బులు వుండగ సై
ఉన్నంతకాలము పండుగ యిక్క
డున్నంతకాలముపండుగ ॥తానతంద॥
సూటుకోటు బూటు దండుగ సై
కాచీలుగిచీలు దండుగ సై
ప్రిపేటు జీతాలు దండుగ ॥తానతంద॥

వ॥ ఒరేలంబోదర సన్నిభ భాండోదర.
మనమింక ప్యాసౌటకల్లరా సై
పట్టియాశలింక యేలరా సై
వరకట్నములుయింక సుల్లరా సై
వరకట్నములింక కల్లారా ॥తందానా॥
జీవితసౌఖ్యముపోతాదిరా సై
భావిజీవితము చెడెరొయురా సై
కాలేజీస్వర్గము కాతేరా ॥తందానా॥

ఉద్యోగములిక లేవురా సై
వృత్తి యెనిజమని యెంచరా అది
శాశ్వితమని మదినుంచరా యిది
విధియని తలనేలకొంచరా ॥తందాన॥

వః ఒరే మొద్దబ్బాయిల్లారా బుధజన అవిధేయుల్లారా వినండి. అదృష్టము మనకు లేదనుకొనక పరీక్షసమయములో పేపరునే కొట్టి వేయుటకు ప్రయత్నముచేయుదము అదృష్టముండిన అందగలదు లేకున్న పోగలదు, అందినట్లయిన ప్రప్రథమ శ్రేణిలో అగ్రస్థానము మనదే. అందకపోయెనా అధమస్థానములో అగ్రస్థానముమనదే. మన చరిత్రనంతయు తెలిసికొని స్కూలుమంది బహిష్కరించిరా వేరగ్రస్తులచేసిరా సైనమనవారుండనేయున్నారు నానాకష్టములకులోనై తప్పించుటకు పిత్రార్జితము కావలసినంత యుండనేయున్నది ఎవరివృత్తి వారికుండనేయున్నది.-

( కథ )

1. చింతెందుకురా వంతెందుకురా
పదరా పట్లా చేస్తాం పదిపోనీ
పదిరానీ పా పదరాపట్లా చేస్తాం.
2 వేయరసూటు తొడుగరబూటు
వేయ్ బుస్ కోటు కాల్చరశిగరేటు
పా పదరా సినిమాచూద్దాం.
3. మిసమిసలాడే పసగలయువతుల
గుసగుసలమవిని కిసకిసనగుదాం
విసవిసవడిచే వివరహానయనల
ముసిముసినగువ్వుల మురియుచు చూద్దాం
పా పదరా సినిమాచూద్దాం.

వః ఓరిదరిద్రదామోదర చక్రవర్తులారా వినుడు, పరీక్షా కాల

మారి కాఉపద్రవము పైబడ సమీపించుచున్నది. ఎవరెవరెట్టిహెచ్చరికల తోనుండవలయునో నుండవలయు. ఈపరీక్షామారిని యెదిరింపజాలము తలిదండ్రులకు తొందరగా జాబులువ్రాయుడు. నేనుప్యాసగుటకల్ల యిదివిపత్సముద్రము. పసిపిక్ మహాసముద్రము ఈదలేను ఒడ్డుచేరలేను నేనుపైలుగాకముందే కన్యకనుమాట్లాడిన కాలేజీలోనున్న మర్యాదతో వరకట్నం కొంతవరకు విలువగా దొరుకును సూట్ కోటు బూటు నీటుచూచి పిల్లకూడ ఒప్పవచ్చును. నేనుపరీక్షతప్పిపోవుటతథ్యము వృథా ఖర్చులని చింతించి వెనుకనన్నుదూషింతురు, దూషించిప్రయోజన ముండదు. అనివ్రాయుడు. ఇక్కడఖర్చయినడబ్బులు అక్కడనైనా జమచేయవచ్చును.

తలిదండ్రికష్టించి ధనముపంపించిన తినితేపిహాయిగా తిరిగివాము
వారిదూషణలకు పాత్రులమైతిమి వ్రతలందు గౌరవప్రదముతొలగె
బంధుమిత్రులలోన పలుచనై పోతిమి అన్నదమ్ములప్రీతిసన్నగిల్లె
శావిజీవితమెల్ల పతనమైపోయెను భ్రష్టుపీడను పేరు పదిలమయ్యె
నయ్యెసర్వంబు వెన్నపాలయ్యెనింక
పదవులందున ఖ్యాతిమోహపడుటవిడచి
ముందుతలిదండ్రివృత్తులగా బుద్ధినిలిపి
బ్రతుకుటయెచాలయోగ్యమౌ బ్రతుకుమనకు.

వ॥ ఓయీ శర్మ సర్వపాపములమోయు ఆదికూర్మ నీపౌరోహిత్యము నీకుండనేయున్నది పౌరులకుహితుడవై సన్నిహితుడవై మానవజీవితమర్మములతెలుపు సద్గ్రంథములచదివిచెప్పి శుభాశుభకార్యములొనరింపచేయుచు గౌరవముగడించి శాపానుగ్రహశక్తినిబడసి తాతలనాటివృత్తిని చక్కగానిలబెట్టి జీవింపుము స్వధర్మమునకన్న ధర్మమొండుగానబడదనిశెప్పగా విన్నావు కన్నావుగా.

వ॥ మామా వీరిలో వీరుచక్కని త్రోవలనే బోధించుకొనుచుండిరి వృత్తికి విద్యకొంతవరకు అవశ్యకము, నిరక్షరకుక్షికి ఎంతజ్ఞానము

న్నను బూడిదలోఁ బోసినపన్నీరగును. విద్యవచ్చినవారు వృత్తినవలంభిం చిన అగ్నికివాయువుతోడైనట్లు అదెంతోవన్నెగడించును. ప్రజలలో రాణించును. వీరువిద్యయందుత్తీర్ణులుగాకపోయినను వృత్తిలోతప్పక కీర్తినిగడించి భార్యాపిల్లలచక్కగ పోషింపగలరు వీరిని మెచ్చతగినదే.

వ॥ శారదా విను విను వీరిగాథకొంచెమువిను, ఓయివర్మా శత్రువులపాలిటి యమధర్మ. సుక్షత్రియుడవై శత్రువులకభేద్యుడవై భారత వీరుడవై భావిపౌరుల కండదండవై స్వధర్మరక్షణమే ధర్మమనిజీవింపుము. యిటువిను.

చ॥ పిడుగయి రామబాణమయి భీముని భీషణ ముష్టిఘాతమై
మృడునిత్రినేత్రమైకదిసి మృత్యువు శత్రులమ్రింగుదాక నీ
మెడిమనుత్రిప్పకోయి మిళిమీరిన మన్నది ధర్మరక్ష నీ
యిడుములకెందుముందు చలియించనికీర్తిపథంబు భారతా.

చ॥ హృదయములేనిజాతులకు హృత్కళికంబయి నిల్చివెల్గరా
చెదరనిబుద్ధినీది స్థిరచిత్తుడవీవు జగానదేనికి
బెదరనిగుండెనీది తనువేమది నొంచనిజాతినీతి నీ
కెదురయి యెవ్వడోపు జగదేకకళాఢ్య గుణాఢ్య భారతా.

ఉ॥ దండిగసైన్యముల్ పెనిచి దక్షిణగోగ్రహణంబు సేయగా
నుండిరివైరులుగ్రముగ నుత్తరగోగ్రహణంబు సేయగా
దుండగులైనవారోగ్రముగ దూకిరిచైనులు హద్దుమీరి భీ
ముండుకిరీటివై నిలిచి పూర్వులఖ్యాతిని నిల్పుభారతా.

ఉ॥ కోరగరానికోరికలకోరుచు నిద్దరు రెండుదిక్కులన్
బోరొనరింపసేనలను వ్యూహముదీర్చుట తేరిచూడరా
కూడుకపోకురా కుడిచి కూరుచుమండక కత్తిబట్టరా
భారమునీదిరా భరతపౌరకుమార వీరా లేవరా.

చ॥ నగిలియుమ్మళ్లపుట్టవలె పర్వతపంక్తులదాటి భూమిపై
దిక్కిచెలరేగిమ్లేచ్ఛులయి యిందుమమిమ్మని వచ్చివారదే

పగతురు నిద్రమేల్కొని శుభమ్మనియూదర శంఖరాజముల్
దిగుదురుకొండకావలను తియ్యనిమాటలపోరు భారతా.

ఉ॥ దుష్టచతుష్టయుల్ కలిసి దొంగలదోపిడిగాంగ్రగూర్చిబల్
పుష్టిగతంత్రముల్ గరపి పొందని భారతకంపగాఖలుల్
నష్టముచేయుచుండి రఘునాతనయంత్రసహాయులయ్యు నా
దుష్టులరూపుమాపి భరతోర్వికిశాంతినిగూర్చు భారతా.

వ॥ ఓయీగుప్త సకలవస్తువుల క్లుప్త క్లుప్తముగకొని గుప్తగుప్తముగదాచి ప్రజలతప్తముగావింపక ధర్మముగ వాణిజ్యమునడిపి స్వధర్మరక్షణచేసి వర్ధిల్లుము.

వ॥ ఓయీకర్షకా యిటువిను.

సీ॥ ప్రాక్పశ్చిమంబుల ప్రాకిమిన్నంటెను భారతసైన్యాల పరిబలకీర్తి
దిశదిశల్ పట్టక దివికేగిపుష్పించె భరతయశోలతల్ బహుముఖముల
ఘనమౌపరిశ్రమల్ దినదినంబునకొక్క వన్నెగడించుచు వచ్చుచుండె
శార్మికనిపుణుల కనుచూపుమితిమీరి మిహిరునివలెమింటమెరయుచుండె

తే॥ కర్షకా కూర్కుచుండక కనులుదెరచి
సాటివారినిమేటివై చాటుమయ్య
పుణ్యములపంటతో వచ్చుభూరియశము
ప్రస్తుతమునీదుబలిమె యావశ్యకంబు.

సీ॥ బండలపైనైన ఖండింపగలశక్తి సామర్థ్యముగల భీమబలుడు
కడవలలోనైన తడిబోసిపండించు సమానశక్తియుగలశాంతమూర్తి
గునపాలతోనైన కుళ్ళగించియునేల పంటలపండించు బాహుబలుడు
రాళ్ళపైనైననురత్నాలపంటను పండింపగలుగు నఖండయశుడు

తే॥ భరతఖండానగల కృషీవలులకిట్టి
ప్రజ్ఞగలదంచు పెరహారుపలుకుచుండ
పాడిపంటలలో వెన్కపడుటతగునె
వంచవెగ తెక్కి బాగళిజట్టివోయి.

సీ॥ క్షుద్బాధదీర్చినా గురుతరబాధ్యత నిర్వహింతునటంచు నిలువవయ్యా
శ్రమకోర్చి చెమటోడ్చి శాయశక్తులవంట పండింతునంచని పలుకుమయ్యా
తిండిగుడ్డకు వడదీర్తునేనని చెప్పి ధైర్యంబుగా చేయితట్టుమయ్యా
భుక్తికిపోన్ మనపొరుగుదేశాలకు పిలిచిత్తునని కేకవేయుమయ్యా
తే॥ ధరస్వధర్మమునకుమించు ధర్మమొండు
గానబడదయ్యా నాగలిఘనతనిల్పి
పంటపండించి ప్రజలకాపాడుమయ్యా
పోలికాభరతావని హర్షమొందు.
ఉ॥ జానెడుభూమినిన్విడక సాగరుకారుపొలంబుపెట్టుచున్
కోనలకొండగుట్టలమకొట్టి వనంబులవృద్ధిచేయుచున్
మానవధర్మమిద్దియని మానసమందుతలంచిచూడుమా
నీనవయౌవనంబు ధరణీకడుసార్థకమౌనుకర్షకా.
ఉ॥ భారతదేశపౌరులకు భారముకాగలదేదికాన మా
హారసమృద్ధితోప్రజలు హర్షమునొందగజేయుదేను వా
భారమటంచుచాటి తగుపాడివిపంటనువృద్ధిచేయరా
భారమునీదిరా భరతపావనిముద్దుకుమార కర్షకా.
ఉ॥ క్షామపిశాచతాండవము కన్నులజూచుచు మారకుందువా
భీమబలంబుతోతగిలి పీచమడంచియు సాగనంపరా
భూమియునీరుసత్తువలు పుణ్యవశంబునమెండె దండిగా
స్తోమతగల్గెపాలకులతోడులభించెను లెమ్ముకర్షకా.
ఉ॥ లోకముక్షామభూతమొక లోకునకే వెరగందిపోవగా
నీకుసహాయకారులయి నిల్చిరివెన్కను దేశపాలకుల్
నీకెదురయ్యరాజయము నీయదెకీరితి సర్వసంపదల్
కాకకుతాళరా భరతకర్షకధార్మికవీరబాలకా.
ఉ॥ నీకుసహాయకారులయి నిల్చిరిచక్కగ రాజ్యపాలకుల్
నీకెటువంటిలోపమును లేనిదినంబులు చేరవచ్చె నీ

వాకిటనిల్పిపిల్చె నవభారతరాజ్యరమాలలామతే
లోకువదీర్తునేననుచు లోకముహర్షముఁబెందుకర్షకా.

చ॥ దినమొకయేడుగా పశులుతిండికిలేక తపించుచుండగా
కునుకుచుగోడకానుకొని కూరుకుచుండుట పీరధర్మమా
తినుటకుతిండిచూపి వడదీర్చరగూర్చర ధాన్యరాసులన్
కనుగొనిహర్షమొంది పశుగంతులువేయును కర్షకోత్తమా.

చ॥ కనకనలాడునిప్పులను గ్రుక్కుచుకాలమునేగుదెంచి దుర్
దినములతెచ్చిపెట్టె తగురీతినెదిర్చి సుభిక్షమేర్పడన్
దినములమార్చినీప్రతిభ దిక్కులుపిక్కటిలంగజేసి నీ
ఘనతనుచాటరా భరతకర్షకవీరకుమారభారతా.

చ॥ మనవగవారలిద్దరని మానసమందుతలంపబోకు దుర్
దినములతల్లి జామమొకదిక్కున మూకెనుముమ్మరమ్ముగా
మనవగవారిముప్పురను మార్కొనినిల్చియు మంటగల్పి నీ
ఘనతనునిల్పరాభువిని కర్షకవీరకుమారభారతా.

కం॥ పండింపుము ధాన్యంబుల
దండిగమృష్టాన్నములను దగదీరతినన్
ఖండాంతరములకనుపన
ఖండితబలధైర్యధుర్య కర్షకవర్యా.

కం॥ దండిమగంటిమిగల నీ
పండగధాత్రికినిగలుగ నన్నముకొదువా
పండింపుముసంతృప్తిగ
పండుగపళ్ళాలతోడ ప్రజహర్షింపన్.

కం॥ అన్నము మృష్టాన్నంబై
యున్నదిహాలమందు పోలికోత్తములందున్
వెన్నెముక జీవరాశికి
అన్నా బాగలిగినిట్టు మలరుసుఖంబుల్.

వ॥ ఓయీ పోలిశా నీవృత్తికి అండదండలై త్రికాలములలో తోడునీడలైన వృత్తులవారిని అన్నతమ్ములవలెపోషించుచు పశుపక్షి క్రిమికీటకాదులకు సర్వజీవులకు దేవతలకు అన్నము మృష్టాన్నము సృష్టించిపెట్టి భూస్వామివై వచ్చుజన్మకు భూపతివై యిహపరములలో సుఖింపుము, నీవేసర్వజీవపోషకుడవు నీవేధన్యుడవు నీవేపుణ్యుడవు నీకు సాటి మేటి నీకునీవే- తే లావా దేవా విచారాదుట్టి యెవరికివారేయము నాతీరే యని పదండి అని ఆటలతో పాటలతో కాలముగడుపుతారు. చదివినా నిష్ప్రయోజనము ప్యాస్ కామనుస్థిరచిత్తులు వికాశ్రితము ఇంతో అంతోవున్న అదృష్టవంతులు.

వ॥ మామా ఈతెగలోచేరియుంటివా.

వ॥ అబ్బబ్బా ఈకోవలోచేరియుండిన ఇన్నిచిక్కులు ఇంతతొందరగవచ్చియుండవు ఆస్తిపాస్తులుపోయియుండవు పక్కిరిచిప్పచేతికివచ్చియుండదు విను.

వ॥ శారదా ఈకచతుర్థశ్రేణికి చెందినవారికథ కొంచెము ఆలకింపుము.

వ॥ అదెందుకుమామా ఇంతవరకు ఉత్తమమధ్యమ అధమశ్రేణియనిచెప్పి యింతలో చతుర్థశ్రేణియనుచున్నావే అధమాధమశ్రేణియనలేదే.

వ॥ ఆ, ఆ, అధమాధమశ్రేణిలోనేను చేరినను నామిత్రులుకొందరున్నారుకదా!

వ॥ ఈపదమువాడటము వారికిఅవమానమనియా.

వ॥ కాదామరి దొంగను దొంగన్ననూ విధవను విధవన్నను రంకులాడిని రంకులాడియన్నను తాగుబోతును తాగుబోతన్నను జూదరిని జూదరియన్నను వదరుబోతును వదరుబోతన్నను కోపము తప్పకవచ్చును. యదార్థమే అయినను ముఖాముఖియనరాదు కదా. అనినొప్పించుట పాపముకదా యదార్థము లోకవిరోధము.

పాపము శారదావిసుగుచెందక వీరి రంకురామాయణము కొంచెము వినుము.

వ॥ శారదా వీరు ఏశ్రేణికిజెందినవారు ఆశ్రేణిలో గుంపులు గుంపులుగా నుందురు తేరుమీదికోతులు ఊరుమీదికి ఊరుమీదికోతులు తేరుమీదికి పోనట్లు ఒకశ్రేణికిచెందినవారు మరొకశ్రేణిలోచేరరు. కలియరు. విను.—

వ॥ ఓబ్రాందీమహామ్మాయి జగజ్జననీ త్రిలోకవశంకరి భయంకరీ జీవానందాధిదేవతా నిన్ను నీపత్న్యాధిదేవతలను ఈకాలేజీస్వర్గలోకమును ఈఅప్సరసా విహార సుందర మందిరములను ఈసర్వసౌఖ్యసంపదల కాలవాలమగు అలకనుమరచి ఎటుపోవుదుము.– ఇకపోవకతప్పదు. ఒకసారి పరీక్షతప్పినమారము కాదు. ఒకసారి రెండుసార్లు తప్పి మూడోసారిపరీక్ష తప్పిపోవనున్న మీరపురుషులము మేము. తప్పిపోయినపోనీ. దిగులు భయము లేని కాలేజీ స్వర్గసౌఖ్యమనుభవించిన వరుడే నధుడన్న వీరాభిమన్యులము. కానీ. తల్లీ బ్రాందీ దురదృష్టవంతులకునాంధీ, నిన్నెట్లుమరతునమ్మా.

సీ॥ సంతోషవారిధిలో సాంగంబుగనుముంచి సంగీతమునదించుశారదాంబ
వ్యాకులతను మహోత్సాహధూళలనెగజిమ్మి శక్తినిబ్రసరించు శర్వునారాణి
శత్రురోగబుణంబు జ్ఞాపకంబుమచంపి ఆనందమొనగెడి ఆదిలక్ష్మి
పిరికిపందతనంబు దరిచేరనియ్యక ఘనపరాక్రమమిచ్చు కాళరాత్రి

తే॥ కామమును రేపపూవిలు కానియబ్బ
శౌర్యధైర్యంబులియ్యగా శరభునయ్య
ధర్మబుద్ధినిగలిగింప ధాతతాత
బ్రాందియధిదేవతానీకు ప్రణుతులివియే.

నః నమోన్నమః తల్లీ నీలతోసంగుమ్ము యిక నీవరికనమ్ము మాకు స్వాతంత్ర్యమొచ్చినవాడే అనాటికిబుద్ధివచ్చిన తాము.

వ॥ ఓకామినీమోహినీ దేవతలారా విద్యార్థులపాలిటి అకాల

మృత్యువులారా మన్మనోవిహారిణులారా మాన ప్రాణ ధనాపహారిణులారా కనులు తెరచి ఎటుచూచినను మీరూపమే కన్పడుచున్నది పుస్తకము విప్పితినా సాక్షాత్తు మీరూపమే ప్రత్యక్షమగుచున్నది. పేజీ పేజీకి పుస్తక పుస్తకమునకు దిక్కు దిక్కునకు నిమిష నిమిషమునకు ఎటుచూచిన మీరూపలావణ్యములే సాక్షాత్కరించుచున్నవి. అబ్బా మీకింతటి శక్తి భగవంతు డొసగియుండెనని తెలియక పొరబడితిని ఎటువిన్నను అమృతములొలుకు మీచిలుకపలుకులే వీనులకు వినబడుచున్నవి. ఛీ జాగ్రిదావస్థ అవస్థపెట్టుచుండెనని చదువుటచాలించి పరుండి కనులు మూసితినా అబ్బా. అహాహా స్వప్నావస్థలో మదన కదన పద్మవ్యూహ వీరాభిమన్య వీరవిహారమే కన్పడుచున్నది. అసింహానాదములే విన్పడుచున్నవి. మనలేను మనలేను. యిచ్చటుక్షణమైన నిలువలేము. విలువవా ప్రాణములీయుచున్నవి. ఈమన్మథావస్థలు పదునాల్గు పదునాల్గులోకములు. ఈయౌవనావస్థ నావగవానికికూడావద్దు. ఓకామినీమోహినీ భూతములారా కడమాటఒక్కటి వినుడు.

సీ॥ వాల్గంటిచూపుల వలలొడ్డిపట్టిన గండభేరుండములే కదలుచుండె
వగలాడెనం కెళ్లు తగిలించియుండిన పులులు గ్రామములకుపోవుచుండె
చిరునవ్వుబోనులో చేర్చిబంధించిన సింహాలుపల్లెలుచేరుచుండె
పడుచుప్రాయపుత్రాట పట్టికట్టినయట్టి మదపుటేన్గులగుంపుమరలుచుండె

తే॥ కొమ్ములనుభూమిగుచ్చుచు దుమ్ములేపి
రంకెలముఖణీలనుచు రేజుంకులేక
తేయువృషభులు కాలేజివిడుచుచుండె
ఛావిగతులను యోచించి బ్రతుకుడింక.

వ॥ ఓకామినీ మోహినీభూతములారా భూతవైద్యుడు లేకనే భూపతనమైతిరి. యికమమ్ముమీరు మిమ్ముమేము చూచుట అపరేతవాధుని పమతమునవే యికవచ్చువిద్యార్థులైనా మననిందు అంగసౌష్ఠవములచూపి అధఃపతనము చేయకుడు నమస్తే నమస్తే.

వ॥ ఓజూదమా యినపగజ్జలతల్లి పాదమా ప్రశాంతహృదయుల పాలిభూతమా మిత్రభేదమ నీమహామహిమ వర్ణింప నాతరమా.

సీ॥ తల్లినీగ్గెనటన్న తండ్రిసచ్చెనటన్న సతిదుఃఖమునమున్గి సమసెనన్న
అప్పులడుగుచునున్న అప్తులుఛీయన్న స్థిరచరాస్తులు పెన్నచేరుకొన్న
ఆకలియగుచున్న అతినిద్రలెమ్మన్న కూటికై పిల్లలు కుములుచున్న
అలమటల్ పైకొన్న ఆటయేపడకున్న వెన్నునలేమిడితన్నుచున్న

తే॥ క్లబ్బువిడిరాడు విడడు తబ్బిబ్బటనడు
కట్టకోయును వేయును దిట్టముగను
కట్టచేముట్ట యిస్పేటు క్యాన్సరగుచు
మట్టుపెట్టును మనుజుల పట్టుపట్టి.

వ॥ శకునిమామలు కాలనేములు పుష్కరాధములు కలిదేవుల్లు కట్టముట్టిన క్యాన్సరుకాదుగాని మానవులుముట్టిన ఏనాడో ఒకనాడు తప్పకకాటందును. క్యాన్సరగును- ఓసప్తవ్యసనాధిదేవతా మాతా మానమస్కారము లందుకొని మమ్ముంవిడువుడు మీ వ్యామో హామున సచ్చిసున్నసుయి పదభ్రష్టులమై దుష్టులమై నికృష్టులమై దుర ద్రుష్టులమై పోవుచుంటిమి యికనైనా మమ్ముంవిడువుడు.

వ॥ అగ్రిజానమోనమః విద్యార్థులనడ్డముంచుకొని భావిజీవిత గౌరవముల పదవుల కీర్తిప్రతిష్ఠల రక్షించుకొనవెంచిన వారిగతేమనెవరు మనములేక యుద్యమములు సాగింపలేరే అగ్రిస్థానము మనకేయిచ్చె దరే.

వ॥ ఓరీశుంతాగ్రేసరచక్రవర్తి విను. భావిపౌరులుమీరేనని మీరు పట్టినపట్టునెగ్గునని మీబలమే బలమని పలువిధములైన మర్యాదలతో ప్రస్తుతించి గౌరవమర్యాదలొసంగి వలలోవేసుకొని వారికార్యముల వారుచక్కపెట్టుకొనిపోయిరి. మిగిలినపదభ్రష్టులము మనమే. పమ్మె లలోపాల్గొని సానికొంపలవెంబడితిరిగి ఆటలు యిస్పేటుఆటలుమరగి ప్రతిపినిమాచూడబోయి ప్రాగితందనాలాడి ధనవ్యయమొనర్చి కాలము

వ్యర్థముచేసి బుద్ధాఫకీరులమైనది మనమే, ఉట్టికిస్వర్గమునకెక్కక ఉభ
యభ్రష్టమైపోయిన దద్దన్నలము మనమే. భావిగతులగమనించక తిరిగి
నవారిగతి యింతే. కాగలదిఅయినవెనుక మేలుకొనినమిప్రయోజనము.
పా పదండి నిందలు అపనిందలు పాపములు తలిదండ్రిశాపములుతప్పవు
మరుజన్మకైనా చక్కనితోవ దొరుకుటకు మార్గముయోచింతము
పదండి.

వ॥ అన్నా సకలగుణసంపన్నా మనమవిన మట్టిపాలైతిమి. మన
కుపుట్టబోయే పిల్లలనైనా సవరించుకొందము విద్యార్థిలక్షణములకొన్ని
వివరింపవన్నా రామన్నా.

వ॥ తమ్ములారా తిండిపోతు తిమ్మన్నలారా వినండి విని ఆచర
ణలో యికనైన ఉంచుకొనండి జీవితాంతము మానవుడు విద్యార్థియ
నియే చెప్పవలయును విద్యార్థిదశయెక్కడికి అయిపోయినదని తలంప
కుడు సత్ప్రవర్తనల సదసద్వివేకముల చక్కగా తెలుపు సద్గ్రంథపఠనము
మానకుడు. విద్యార్థిలక్షణములవినుడు.

సీ॥ వేకువనేలేచి విధులెల్లఘటించి తలిదండ్రులకువిద్దురకు దలచిమదిని
గురువర్యుస్మరియించి కులదైవమును శ్రీమహార్తులసతియుతముగా స్తుతి
యొనర్చి
పాలుపండో లేక పంచదారయొపెట్టి సాష్టాంగపడిమ్రొక్కి సంతసమున
ఆప్రసాదంబును నమృతంబుగాగొని పఠియింపగావలె శాస్త్రములను
తే॥ భయము భక్తియు వినయంబు బంధుప్రీతి
శ్రద్ధయును స్నేహపాత్రత శాంతిదాంతి
బ్రహ్మచర్యంబు సత్యంబు పట్టుదలయు
లక్షణములివ్వి విద్యార్థి రక్షణములు.

వ॥ శబాష్ రామన్న తెలివిగలవాడవేవన్నా ముందితెలివి యే
మైపోయెనన్నా.

వ॥ ఇట్లొకరినొకరు హేళనచేసుకొనుచు పెట్టెలు గిట్టెలు సన

రించుకొని పరీక్షల సమయమునకు ముందే ఊర్లుచేరుకొందురు. వీరుచే యని దుష్కార్యములు వీరునడవని దుర్నడతలులేవు. వీరు నాకన్నత మ్ములు వీరిలో అగ్రినాయకుడను నేనే.

వ॥ మామా ఈశ్రేణిలో చేరియుంటివా.

వ॥ చేరియుంటివాయవనేల చేరితిని చెడితిని. చెడినిచెంతచేరితిని.

శారద శాస్త్రికులనుమాటలు నాల్గుచెప్పెదనువిను.

ఉ॥ పాపములేదు పుణ్యమనుపల్కులుకల్లలు కల్పనాకథల్
అపయిజన్మమున్నదను నయ్యలమాటలు బూటకంబులౌ
నేపనిచేతగాక తమకెచ్చుటత్రోవయొకింతలేక యీ
పాపము పుణ్యమఁ గొలుసుపట్టితగిల్చిరి నీతిబాహ్యులై.

వ॥ మరియు,

ఉ॥ పాపమొ పుణ్యమో యెవడుపట్టుగచూచినవాడు వీనికిఁ
రూపములేదు కన్పడవు లోకులమైమరపించి యీవలఁ
సోపి భిగించిత్రాపిరోకసోలెడు మోక్షరసంబు దానితో
కైవయి పాపపుణ్యములుకద్దని కేకలుపెట్టరిపల్కిల్.

ఆ॥ పాపపుణ్యమనెడి పల్కులేకల్లలు
పుట్టుకన్నమాట పట్టిమాట
చేతగానివారు చేయకూడదటంద్రు
చేతనైనవన్ని చేయవచ్చు.

వ॥ అనిఅంటున్నారు. వింటున్నాను. నీవేమనెదవు.

వ॥ నేనేమనెదను ఉన్నదనియెదను మామా.

కం॥ లోకులసుఖములఁ గనుగొని
వ్యాకులపడి వారిలేని వైనముకోరకుఁ
శోకమునఁ తపియించెడి
లోకులెముందిట్లటన్న లోకులుధాత్రిఁ.

కం॥ ఉన్నదిజీవికిపుట్టుక
యున్నదిసుఖదుఃఖములుగ నున్నవిరెండై
యున్నవిలేవని దలచిన
యన్నెలె దరిదాపులేని యన్నలుధాత్రిన్.

వ॥ శారదా పాపపుణ్యములులేవని ధర్మాధర్మములు కల్లలని వావివరుసలు శూన్యములని దేవత్వ మానవత్వములు శుద్ధాబద్ధములని న్యాయాన్యాయములు నుల్లలని సంచరించిన మానవులేనందువా నానావిధ దరిద్రులు.

వ॥ ఔనుమామా.

చ॥ చచ్చెడివారుపుట్టరిట స్థాయిగనిల్తురు నిర్జరాస్థలిన్
ఖచ్చితమంచుబల్కు మతకర్తలుపుట్టి మతంబునిల్పుచున్
వచ్చిరి కాలహేతువున నాస్తికమెల్లెడ నాక్రమించుచున్
వచ్చెను వేదసూత్రములు నాటివి నేటికి సంశయంబయెన్.

వ॥ మామా,

ఉ॥ పుట్టినవారెగిట్టి మరిపుట్టుదురుర్విని పూర్వకర్మలన్
పుట్టిగరాదటంచు కడుపూనికతో తపమాచరించుచున్
గట్టిగబుద్ధికట్టి తమకర్మలకేడ్వక శాంతచిత్తులై
దట్టలె పుట్టి యిప్పుడిటు దివ్యులరీతి వెలుంగుమానవుల్.

వ॥ శారదా తపోనియమవృత్తులయందు నిలచినవారు దానధర్మములుచేసినవారు దైవనిర్మిత ధర్మసూత్రములకు కష్టమనక కట్టుబడి సంచరించినవారు పరిష్కృతధనికులు. విద్యాధికులు రూపలావణ్య యశో సంపన్నులు. బలవంతులు ఉన్నతోద్యోగులు భోగులు భూస్వాములు కారేనందువ.

వ॥ ఔను మూలములేక వేదియుకాదు మామా.

తే॥ ముందుజన్మానచేసిన పుణ్యఫలము
ధనము విద్యయు రూపంబు తనుబలంబు
నిచ్చిసుఖపెట్టు జీవుల కచ్చితముగ
వారె సుఖపడుచున్నట్టివారు మామా.

ఉ॥ మూలముశుద్ధపాపనుయి పుట్టుకనొందును జంతుజాలమై
మూలముశుద్ధపుణ్యమయి పుట్టకనిల్చును నిర్జరాస్థలిన్
మూలముమిశ్రిమంబునయి పుట్టునుమానవరూపధారియై
మూలమెముఖ్యకారణము మూలముచంపి తరింపగావలెన్.

వ॥ శారదా సందేహముగలదొక్కటి ఏమందువా.

ఉ॥ చచ్చినవారెపుట్టుదురు స్థాయిగపైనట నుండబోరనన్
కచ్చితమేయనునొక్కడు కాదనునొక్కడు దీననేదియో
కచ్చితమైనమార్గమును కంటికిగన్పడునట్లుతెల్పుమా
గచ్చులగందరిగోళ మతకర్తలు యోచనచేసిచూడగన్.

వ॥ మామా కంటికి కానబడలేదా అట్లయినవిను,

ఉ॥ పుట్టుటగిట్టుటీపృథివి పుట్టినయప్పటినుండె నెప్పుడీ
పుట్టుటగిట్టుటెందుకని పుట్టుకచంపగజూతురెందరో
గిట్టునెపక్వజీవులకు గిట్టునుచంపి పురోగమింపగా
పుట్టుకచంపగానగునె బూతులనీతులవల్లచూడగన్,

వ॥ మామా ఈపుట్టుక బాడబానలమువంటిది, పుట్టుకవాపలేరు. బాడబానలము చేబట్టలేరు సిరిని స్త్రీని మనోవాక్కాయకర్మల జయించినను జాగ్రిదవస్థలో పోనూకినను స్వప్నావస్థలో జయించలేరు, స్వప్నావస్థలోజయించిన వారిలోకమునకురారు, దైవత్వమేర్పడి స్వర్గ లోకనివాపమేర్పడును. సర్వసౌఖ్యముల చూరగొనును.

వ॥ శారదా.

తే॥ మనసుపరిపక్వమౌటకు మార్గమెద్ది
ఎట్టినియమంబులన్ చేయుటట్టివలయు

ఎన్నియోతోరివలున్నవి యేదిత్రోవ
తెలియచెప్పుము విందము తెలిసినంత.

వ॥ అట్లనా అయినవిను.

ఆ॥ దైవభక్తియొకటి దానంబువొక్కటి
మార్గదర్శకంబు మానవునకు
దీనచిత్తశుద్ధి మానవుండందును
చిత్తశుద్ధివల్ల చిక్కుసుఖము.—

వ॥ మామా చిత్తము శుద్ధమౌటకు దైవభక్తియే మూలము. దైవభక్తిలేక దైవమునారాధింపక చిత్తశుద్ధిదొరుకదు. చిత్తము పరిపక్వదశకుచెందదు.

మ॥ పరిపక్వంబయి పుట్టగావలయు నీపాపాగ్ని చల్లార్పగా
పరిపక్వంబునుగాని వేషధరులీపాపాగ్ని చల్లార్తురా
స్థిరమైచిత్తముపండి పక్వరుచినల్ దిక్కుల్ గుమాళింపుచున్
విరజిల్లన్ వశ లేకయున్నవగువా నీతౌపచల్లార్పగా.

వ॥ మామా పరిపక్వమైతవారికచ్చట స్థానమున్నది. అపక్వజీవులకచ్చట నిలువనీయుండరు. నిలువనీయరు. మానవుడు పాపపుణ్యమిశ్రమజీవి యిటువిను.

సీ॥ ధనికుడై యొకడు నిర్ధనికుడై యొక్కడు పుట్టిరే వారెట్లుపుట్టినారు?
జ్ఞానియైయొకడు నజ్ఞానియైయొక్కడు పుట్టిరే వారెట్లుపుట్టినారు?
ప్రభువుగానొకడు సేవకుడుగానొక్కడు పుట్టిరే వారెట్లుపుట్టినారు?
రోగిగానొకడు నీరోగిగానొక్కడు పుట్టిరే వారెట్లుపుట్టినారు?

తే॥ పుట్టిగిట్టుచు గిట్టుచు పుట్టుచుండు
వారలెవ్వరు తెచ్చుటెవారువారు
జ్ఞానదృష్టినిజూచిన గానబడద
గానబడకున్న చెప్పెడిఘనులులేర.

వ॥ శారదా చెప్పెడివారులేకేమి వినకేమి,

వ॥ శారదా.

ఉ॥ చెప్పుచునుండె భారతము చెప్పెను భాగవతంబు గీత యుఁ
చెప్పుచునుండె గ్రంథములనేకము బుఱ్ఱకునెక్కినవా కదా?
ముప్పొనగూర్చు పాపములు బుఱ్ఱకునెక్కినరీతి నెక్కవే
చెప్పినవచ్చునే వినుసె చేరునెయచ్చట చేరినిల్చునే.

వ॥ సద్గ్రంథకాలక్షేపముల నొకవైపున సానినోటవెలువడు చతురవచన పల్లావముల నొకవైపున త్రాసునపెట్టితూచిన కొంచమటుసాని వైపే తూగునుగాని కాలక్షేపమువైపు తూగదు. దుష్కర్మకున్నశక్తి సత్కర్మకుండదు. యువకులబుద్ధిని కాంతవలపు ఈడ్చునుగాని కాలక్షేపము ఈడ్వలేదు. కర్మదేవత యెదురైనపుడు కాలకంఠుడైనను కెవ్వునకేక వేసిపడి విలవిల తన్నుకొని ధుమ్ముతినవలసినదే కర్మనుచంపినవాడే మగవాడు మొనగాడు. శారదా.

ఉ॥ చంపినకర్మదేవతను చచ్చునె చంపగత్రొవలున్నవే
కొంపలముంచు నెట్టిఘనకోవిదునైనను త్రొదుత్రెంచు బల్
నింపుముతెంపుగల్గు ధరణీశ్వరునొంచు గలంచు ద్రుంచు నీ
తెంపరికాలదన్ని కడతేరెడు మార్గములేవొ తెల్పుమా.

వ॥ మామా లేకేమి విను.

తే॥ ముందుచేసినకర్మలు మూలకొంచు
జన్మజన్మాంతరములకు పమసిపోక
మొలకలెత్తుచునుండును కలియుజూచి
చంపతగినట్టి తెరగుల చంపకున్న.

వ॥ శారదా ఆచంపతగినట్టి తెరవులనే వడుగుచున్నది. దానినే తెలుపుమనుచున్నది.

వ॥ అట్లయిన విను మామా.

సీ॥ ధర్మతత్పరతను దైవంబుమున్ప్రొద్దు కొలుచుచుండిననిది తొలగుకొంత
దానధర్మంబుల తనకున్నదానిలో విచ్చుచుండిన విదిచచ్చుకొంత

దేవతా సేవల దేహశక్తికొలంది చేయుచుండిననిది చెడునుకొంత
నిత్యనై వేద్యంబు నియమంబుతోడను హరికియ్యగానిది విరుగుకొంత

తే॥ పెంపకముచేయకను దీనిచంపుచుండ
పాపమడుగంటి పుణ్యంబు పదిలమగును
పదిలమున జీవి పదిలమై ఫలములంది
యంది యిహపరసుఖముల నందుకొనును.

వ॥ మామా అనేకులు అనేకమైనత్రోవలజూపుదురు. ఎవరెవరి దృష్టి ఎంతెంతుండునో అంతవరకే గన్పడినట్లు తెల్పుచుందురు. వారి వెంబడి పోవుటకు అసాధ్యము, గమ్యస్థానమెన్ని జన్మలెత్తినా గానరాదు. వృధాకష్టమగును. కన్నది విన్నది ఉన్నది యింతె యిటువినుం

ఆ॥ దైవభక్తియొకటి దానంబునొక్కటి
మార్గదర్శకంబు మానవులకు
వేరుత్రోవ లెందు వెతకినన్ గనరావు
వేదమార్గమిదియె వెతకిచూడ.

వ॥ శారదా మరియొకసందేహము బాధించుచున్నది. ఇదిగట్టి సందేహము దీనిని విమర్శించి చెప్పుటకష్టము. అడుగుటసులభము ఏమందువా.

చ॥ గురువునునమ్మి దైవమునుకొల్వక మూలనుత్రోసి సర్వమున్
గురువనినమ్మికొల్చు గుణకోవిదులెందరొనుండిరిధరన్
పరమపదంబు చేర్పగల ప్రజ్ఞమహాత్వము వారికుండునే
హరిహరులియ్యగాగలరె హంగులునాలుగుకూడ కుండినన్.

వ॥ మరియు.

ఉ॥ తల్లియుతండ్రియున్ గురుడుదైవమటంచను వాగ్గుమెట్టలన్
కల్లగనెంచిమూడవదిగట్టిగనమ్ము మతంబులెన్నియో
కొల్లగనుండె వీరుతమకోర్కెలుదీర్పుకొనంగ ముందువే
చెల్లనిరూకలై తిరిగి శ్రీహరికొల్వగవత్తురాయిటన్.

వ॥ మామా వత్తురు వత్తురు తప్పకవత్తురు వీరుపూర్వజన్మమున శిష్యులమోసముచేసిన గురువులు, తానొకదారినపోవుచు శిష్యులకొక దారినిచూపిన ద్రోహులుగాబట్టి గురువులచేమోసగింపబడి యొకజన్మ మంతయు వ్యర్థముచేసికొనుచున్నజీవులు వారికియెట్టిమహనీయులు చెప్పినను వినరు. మరుజన్మమున వేరొకరుచెప్పకనే తెలుసుకొని భగవ దనుగ్రహము సంపాదించుకొనగలరు. యిటువిను.

సీ॥ తల్లికన్నను తండ్రి తండ్రికన్నగురుండు గురునికన్నను హరివరుసనుండ
గురునిపైననెతన బరువంతయును మోపి దైవంబుమరచుట తగనితప్పు
తప్పకై మరలను తప్పకజన్మించి దైవంబుమున్ప్రొద్దు తాదలంచి
బంధవిముక్తినిక బడయంగనోచునుగాని యీతోవలుకష్టమునకై

తే॥ దేవదేవునిదలచిన ధైర్యముగను
చెడనికైవల్యపదవిని చేరుకొనును
ముందుకర్మంబు ప్రబలమై బుద్ధినంటి
యిట్టిమార్గాలనడిపించు పట్టుపట్టి

వ॥ శారదా నీవిద్యాపాటవమెంతవరకున్నది. వాక్పటుత్వమెం తవరకున్నది గమనించుటకై ప్రయత్నించితిని. చదివినచదువు సార్థక మైనది సంతోషమైనది. ఇందులో మేనమామనాదరించినధర్మము మేన రికమును పాటించినకీర్తి మిళితమొనర్చి జన్మపావనము చేసికొనుము యిటువిను.

శా॥ ధారాదత్తముచేసినట్టి చదువుల్ద్రవ్యంబునక్కీర్తినిన్
ధారాళంబుగసంగ్రహింతు మరలన్నామాటలన్నమ్ముమా
మా రేదినికిలేదుబుద్ధిమరలన్ మార్గంబుగన్పట్టెడిన్
వేరూహింపకచేయిచేయినిడుమా నీవీడలన్వివేర్వరన్.

వ॥ మరియు.

ఉ॥ విప్పితిజ్ఞానచక్షువును వెల్గునొసంగె వివేకసంపదల్
తప్పునెరింగిదిద్దుకొను తాహతుగల్గెను దైవసాక్షిగా

తప్పుడుదారులఁ మరచి తప్పకనీకొనగూర్తుకీర్తి నీకఁ
తప్పుఅనీమదిఁ మరచి తాళికిసాజ్ఞనొసంగుశారదా.

వ॥ మామా తాళియన్న భయమగుచున్నది తాళియేసుఖమొసంగును తాళియేకష్టపరంపరలోముంచును. తాళికట్టించుకొన్నయువతి గాలముపడిన చేపపగిది సంఘగాలమునబడి తన్నుకచచ్చును. తాళి స్త్రీజీవితమును రక్షించను భక్షించను కర్తగాన తాళియన్న భయమగును మామా.

తే॥ దంపతులమధ్య ధర్మసూత్రంబు తాళి
తాళిలోగల్గు ధర్మంబుతలపకున్న
మంగళము నమంగళమయి మరుక్షణంబె
ప్రాణమానంబులుఁ గంగపాలునిజము.

వ॥ శారదా అన్నివిధవాత్రతయైనప్పుడు ఇదిమాత్రముకాదా ముందుజన్మలో దైవభక్తిగలిగి ధర్మమునకు కట్టుబడి పతివ్రతస్త్రీకి భర్త వశ్యుడై నిరంతరము కంటికిరెప్పవలె కాపాడువను వాక్యము విన్నదే కదా, ప్రకృతిలో అట్టిదంపతుల చూచుచుంటిమిగదా. ఏటికెదురీదు దంపతులు గన్పడుచుంటిమిగదా ఇదియంతయు పూర్వజన్మ సుకృత దుష్కృతములననుభవించి వడుచుచుండునుగాని ప్రకృతము చేయునదేదియు లేదు. తనకర్మమని స్థిరచిత్తముతో ఒరులననక దుఃఖమాపి దైవ సేవచేయుచుండుట మానవమర్యాదకదా. ఇవటుంచి యిటువినుము.

మ॥ బ్రతుకేపాడయికూళ్ళయోనిఁ బాపాత్ములున్నంతకుఁ
మతిహీనుండనుగాక తెలుకొని నీమాటల్ మదిఁ నిల్పుమన్
బ్రతుకుఁ భద్రముచేసినిల్పుకొనెదఁ బాటించి సాక్షిగా
గతముఁ నెంచక చెంతఁ జేర్చు యశమున్ గైకొందువిద్యాత్రినిన్.

వ॥ మామా.

ఆ॥ మూడుముళ్ళవలనఁ బుట్టొందుకష్టంబు
మూడుముళ్ళవలన పుట్టుసుఖము

మూడుముళ్లుస్త్రీని ముడిబెట్టి నిలబెట్టు
మూడుముళ్లటన్న పుట్టుభయము.

వ॥ అయినాధైర్యముచేసి పూర్వజన్మసుకృత దుష్కృత ఫలము లెట్లున్న నట్లగునని తలంచి స్థిరచిత్తనై మేనరికము నుద్ధరించిన రాబో వుజన్మకు సుకృతఫలముండుననియు నిన్నుజూచి నీదీనతనుజూచి శారద నక వాచెయి నీచెయి పెట్టుచుంటిని మామా.

౹౹౹ నేనినునమ్మిప్రాణమును నీచెయిపెట్టుచునుంటి పట్టుమా
(చేతులనందిచ్చును వరుడుగ్రహించును)
దీనికిసాక్షిభూతుడయి దేవుడు దీవనలియ్యగావలెన్
నీనియమప్రమాణములు నీడయిశాంతినిగూర్పగావలెన్
గానము వేరుమార్గములు కన్నది విన్నది యున్నదింతయే

వ॥ శారదా మార్గదర్శకయువతులయందు తలమానికమనై వెలుగొందుము. బలిదానముగా నీధర్మము ఆచంద్రార్కముగ అందు నిందు నిండి నివిడీకృతముగ నుండుగాత. శారదా ఆఖరుప్రమాణము విటువినుము.

ఆ॥ దైవసాక్షిగ వాతలిదండ్రిసాక్షి
నీకువశవర్తినుడనయి నిల్చిగెల్తు
లోకమర్యాదలనునెల్ల రూఢిగాను
నమ్మునామాటనీమది నమ్మిగాదు.

మంగళము.



# భరతవాక్యము.

సీ. పాడిపంటలతోడ బహుభాగ్యములతోడ
భారతావని చాల వర్ధిలుగాత
అన్యోన్యులై ప్రజలందరు నొక్కటై
సుఖములు పెంపొందు చుండ్రుగాత
పరిపాలకుల్ ప్రజల్ భావభేదము లేక
సుముఖులై ధర నేలుచుండ్రుగాత
దేశరక్షకభటుల్ ధీరులై వీరులై
చిరకీర్తి మిగులవర్ధింత్రుగాత

తే. జ్ఞానవంతులు కవులు వైజ్ఞానికులును
పండితులుగాయకులతోడ భరతభూమి
నిండి నిబిడీకృతంబుగా నుండుగాత
ఆయురారోగ్య భాగ్యాలనలరుగాత.



శ్రీ రంగరామానుజ ప్రెస్, చిత్తూరు.